సాక్షి

# ఫన్‌డే

ఆదివారం :: 30 ఏప్రిల్ 2017







LITTLE SOLDIERS

# లిటిల్ సోల్జర్స్

మే 3న ప్రపంచ పత్రికా స్వేచ్ఛా దినోత్సవం సందర్భంగా...

10వ పేజీలో...

బ్రిటన్‌లోని 'ఫస్ట్ న్యూస్'
పనిచేస్తున్న బాల పా
మనదేశంలో ఇలా
'బాలక్‌నా
బాల పాత్రి
పత్రికా స్వే
కాలంలో
ముందుత
రేపటి కాలా కి
ఆశాదీపాలైన బాల
ఈ కవర్ స్టోరీని అంకిత

# సునాయాసంగా సంతానవంతులవుతారు



## తెలుగు రాష్ట్రాల్లో ప్రఖ్యాతి గాంచిన సంతాన వైద్యనిపుణురాలు డాక్టర్ పద్మలత యారాశి వెల్లడి

## సంతానరాహిత్యంతో అలమటిస్తున్న వేలాది కుటుంబాల్లో పసిపిల్లల చిరునవ్వులు చిందించిన సక్సెస్‌ఫుల్ డాక్టర్

ప్రశ్న: దైవాంశ సంభూతురాలు డాక్టర్ పద్మలత గారికి ఆశీస్సులు. నాపేరు శేషభట్టర్ వేదాంత చారి. నేను వాస్తు, జ్యోతిష్య శాస్త్ర సలహాలు, సూచనలు ఇస్తుంటాను. మీతో నాకు ప్రత్యక్ష పరిచయం లేకపోయినా.. పరోక్ష పరిచయం చాలా ఉంది. మీ గురించి చాలా మంది ద్వారా విన్నాను. తెలుసుకున్నాను. గత సంవత్సరం స్వయంగా నా కూతురు శ్రీమతి శ్రీలక్ష్మి అల్లుడు కమలాకర్ గార్లను మీ దగ్గరకు పంపించాను. వారి ఆరోగ్య పరిస్థితుల్ని పరీక్షించి. చక్కని చికిత్స చేసారు. ఎన్నో హోమాలు, వాస్తు దోష నివారణలు చేసినా రాని ఫలితం. మీ దివ్యమైన హస్తవాసి వల్ల వచ్చింది. ఇప్పుడు నేను తాతనయ్యాను అని చెప్పడానికి సంతోషిస్తున్నాను. చనిపోయిన నా భార్య, నా మనవరాలిగా పుట్టిందని అందరూ అంటుంటే. అనందంతో కన్నీళ్ళు ఆగటం లేదు తల్లి. నిండు నూరేళ్ళు చల్లగా జీవించు. ఇలాగే పదిమంది జీవితాల్లో వెలుగులు నింపు.

శేషభట్టర్ వేదాంత చారి, గుంటూరు.

జవాబు: ఆరుపేజీల మీ ఉత్తరం చదివి పులకించి పోయానండి. స్థలాభావం వల్ల పూర్తి ఉత్తరాన్ని ప్రచురించలేకపోయాం. అక్షరం అక్షరంలో మీ ఆనందం కనిపించింది. పదం పదంలో మీ ఆశీర్వచనం కురిసింది. ధన్యోస్మి. ఎంతోమందికి ఆనందాన్నిచ్చే వైద్య వృత్తిలో ఉన్నందుకు ఎంతో గర్వపడుతున్నాను. మీలాంటి పెద్దల ఆశీర్వాదం. ఆధునిక వైద్య విధానాలు అందిస్తున్న ఫలితం అనిర్వచనీయమైన అనుభూతిని కలుగచేస్తుంది. తల్లిదండ్రులు కావాలనుకున్న ఎంతోమంది దంపతులకు మనసా వాచా కర్మణా వైద్య సేవ చేసే అవకాశం రావటం ఈ జన్మకు నేను చేసుకున్న పుణ్యంగా భావిస్తున్నాను. మీకూ, మీ అమ్మాయికి నా అభినందనలు.

ప్రశ్న: డాక్టర్ గారికి నమస్కారం

నా వయస్సు 31 సంవత్సరాలు. పెళ్ళయి నాలుగు సంవత్సరాలైనా పిల్లలు కలుగలేదు. ఈ మధ్య నేను, నా భార్య వైద్య పరీక్షలు చేయించుకున్నాము. సమస్య నాదేనని.. నా వీర్య నాశం మూసుకుపోయిందని. అందుకే పిల్లలు పుట్టట్లేదని చెప్పారు. నా సమస్యకు ఎలాంటి చికిత్స ఉంది? నేను తండ్రి నవుతానా?

జే.ఆర్. మూర్తి, మధిర.

జవాబు: మూర్తి గారు. పురుషుల్లో కొన్ని రకాల వ్యాధుల వల్ల దీర్ఘకాలిక సమస్యల వల్ల వీర్యనాళం మూసుకుపోతుంది. దాంతో పురుషుడి వీర్యం, స్త్రీ అండంతో ఏకమవదు. ఫలదీకరణం చెందదు. ఇలాంటప్పుడు నిపుణులైన డాక్టర్లు వీర్యోత్పత్తి జరిగే వృషణాల నుంచి డైరెక్టుగా శుక్రకణాలు బయటకు తీసి.. స్త్రీ అండంతో కలిపి. ఫలదీకరణం చెందిస్తారు. దాంతో స్త్రీకి గర్భం వస్తుంది. అలాగే ఐ.యు.ఐ (ఇంట్రా యుటరిన్ ఇన్ సెమినేషన్) ద్వారా మీకు తండ్రి అయ్యే అవకాశం ఉంది. ఈ చికిత్సలో పురుషుడి నుండి సేకరించిన వీర్యాన్ని పరీక్షించి. కేవలం చురుకుగా ఉన్న కణాలను సిద్ధం చేసి. డైరెక్టుగా స్త్రీ గర్భాశయంలోకి ప్రవేశ పెడతారు. చాలా సునాయాసంగా పూర్తయ్యే ఈ విధానం వల్ల ఎందరో సంతానవంతులయ్యారు.

ప్రశ్న: డాక్టర్ గారికి నమస్కారం

నా వయస్సు 24 సంవత్సరాలు. పెళ్ళయి సంవత్సరం అవుతోంది. అయినా నేనింకా గర్భం దాల్చలేదు. నేను ఒకసారి మిమ్మల్ని కలవాలని అనుకుంటున్నాను. నాతో మా వారు ఎక్కడికి బయటకు రారు. మీ దగ్గరకు కూడా రారు. నేనొక్కదాన్ని వచ్చినా నాకు చికిత్స చేసి. గర్భం వచ్చేలా చేస్తారా?

సులోచన, కాజీపేట

జవాబు: మీరు ఎప్పుడైనా. నా దగ్గరికి రావచ్చు. మీ విషయంలో సమస్య ఏమిటో తెలుసుకోవడానికి మీకు కొన్ని పరీక్షలు చేస్తాము. సమస్య గనుక మీలో ఉంటే. చికిత్స చేయటం ద్వారా మీకు గర్భం వచ్చే అవకాశం ఉంది. ఒకవేళ మీలో ఏ సమస్య లేకపోతే....? అప్పుడు తప్పకుండా మీ వారిని పరీక్ష చేయాల్సి ఉంటుంది. అప్పుడే. మీరు తల్లిదండ్రులయ్యే అవకాశం ఉంటుంది. సంతానం కలగటం అనేది భార్యాభర్తలిద్దరికీ సంబంధించిన విషయం. ఇద్దర్నీ పరీక్ష చేయాల్సి ఉంటుంది. ఒకవేళ ఇద్దరూ కలిసి రాలేకపోతే.. విడివిడిగా వచ్చినా వైద్యం చేయటంలో ఏ లోపమూ ఉండదు.

ADVT







• టాప్ స్టోరీస్



తింటే... భంగుపోటు
ఫన్నీ ఫుడ్ - 5



బాపుర్రే!
ఫన్‌టైమ్ - 7



కార్మికులూ...
కష్టసుఖాలూ...
మే డే - 16



దైవ దాతలు
గివ్ డే - 19



మంజునాథుడు
కొలువుదీరిన ధర్మస్థల
టూర్‌దర్శన్ - 22



పోనీబ్రైడ్
సిగసింగారం - 26



ఈ టిట్లాకు తిక్క రేగితే!
ఉత్తమ విలన్ - 31


జీవన సారం



స్వేచ్ఛాయుతమైన పత్రికా వ్యవస్థే ప్రజాస్వామ్యానికి మూలస్తంభం. ఇందులో మరో ప్రశ్నకు తావులేదు.

- హ్యూ గ్రాంట్ బ్రిటిష్ నటుడు, నిర్మాత



• హావ్ ఫన్

# కెమెరామెన్ బుజ్జిగాడితో అక్షర

రామాపురం నుంచి ఊరి జనమంతా కలెక్టర్ ఇంటి దగ్గర చేరారు! అప్పటికే బాగా చీకటి పడింది. కలెక్టర్‌గారి సెక్యూరిటీ సిబ్బంది వాళ్లను గేటు బయటే నిలబెట్టారు. 'ఏం కావాలి? ఏంటీ దాడి? అని గట్టిగా వాదించి ఊరివారినందరినీ వెళ్లిపొమ్మని వారించారు.

ఊరి జనం కదల్లేదు. పోలీసు వ్యాన్‌లో పోలీసు సిబ్బంది చేరింది. ఇరువురి మధ్యలో తోపులాటలు. లాఠీలు పైకి లేచాయి. కొందరు కింద పడిపోయారు. కలెక్టర్ హడావుడి విని బయటకు వచ్చారు. విషయం ఏంటో.. ఎవరో ఒకరిని ముందుకొచ్చి చెప్పమన్నారు.

పదేళ్ల అక్షర, ఆరేళ్ల బుజ్జిగాడిని లాక్కుంటూ ముందుకొచ్చి నిలబడింది. బుజ్జిగాడి చేతిలో ఉన్న ఫోన్ రికార్డింగ్ ఆన్ చేసుకోమని చెప్పింది. పై మెట్టుపై కలెక్టర్ కింది మెట్టుపై అక్షర.

"ఉదయగిరి మండలం రామాపురం ఊరిలో డాక్టర్ రాడు? చిన్నపిల్లలు, అవ్వలు, తాతలు జ్వరాలతో పిట్టల్లా రాలిపోతున్నారు. ఎన్ని సార్లు చెప్పినా ప్రయోజనం లేదు. రామాపురంపై శీతకన్ను తప్పదా? ఇప్పటికైనా కలెక్టర్‌గారు గట్టి చర్యలు తీసుకుంటారా? వేచి చూడాలి. కెమేరామెన్ బుజ్జిగాడితో అక్షరా, సైనింగ్ ఆఫ్!

కలెక్టర్ పది మెట్లు దిగి వచ్చాడు. "చెబితే సరిపోద్దిగా టీవీలో మాట్లాడినట్లు ఎందుకు? అని నవ్వాడు.

టీవీలో చెప్పినట్లు చెబితే, మీరు తొందరగా డాక్టర్‌ని పంపుతారని. మా ఊరే కాదు అన్ని ఊర్లకు పంపుతారని అమాయకంగా చెప్పింది అక్షర.

కలెక్టర్ అక్షరకు, బుజ్జిగాడికి షేక్ హ్యాండ్ ఇచ్చాడు. ఊరి జనం చప్పట్లు కొట్టారు. లిటిల్ సోల్జర్స్ గెలిచారు. రేపటికి ముందడుగు వేశారు..! బిగ్ ఛేంజ్ సాధ్యమయ్యింది.

ప్రేమతో...

ఎడిటర్, ఫన్‌డే & ఫ్యామిలీ

# ఖడ్గశిల్పం

• వి'చిత్ర'కళ

కత్తులతో ఏం చేస్తారు? 'ఆ మాత్రం తెలీదా! ఆరితేరిన వీరులైతే యుద్ధాలు చేస్తారు. యుద్ధవిద్యలేవీ రాకపోతే ఇంచక్కా వంటింట్లో కూరగాయలను తరుగుతారు' అనుకుంటున్నారా..? కళానైపుణ్యం ఉండాలే గానీ, కత్తులతో నిలువెత్తు శిల్పాలను కూడా చేయవచ్చని నిరూపిస్తున్నాడు ఆల్ఫీ బ్రాడ్లీ అనే బ్రిటిష్ శిల్పి. చురకత్తులు మొదలుకొని పొడవాటి కరవాలాల వరకు రకరకాల కత్తులను ఉపయోగించి నిలువెత్తు శిల్పాన్ని తీర్చిదిద్దాడతను. 'నైఫ్ ఏంజెల్' పేరిట రూపొందించిన ఈ శిల్పం తయారీకి ఒకటి కాదు, రెండు కాదు... అక్షరాలా లక్ష కత్తులను ఉపయోగించాడు ఈ కుర్రాడు. ఇంగ్లండ్‌లోని ష్రాప్‌షైర్ పట్టణంలో బ్రిటిష్ ఐరన్ వర్క్స్ సెంటర్





వర్క్‌షాపులో అహరహం శ్రమించి దీనిని తీర్చిదిద్దాడు. అయితే, ఈ శిల్పం ప్రదర్శనకు నోచుకోకపోవడమే అసలు విషాదం. ఏమాత్రం కళాదృష్టి లేని పోలీసులు ఈ ఖడ్గశిల్పాన్ని హుటాహుటిన స్వాధీనం చేసుకున్నారు. శిల్పం తయారీకి వాడినవి మారణాయుధాలనే నెపంతో ఏకంగా 41 పోలీస్ స్టేషన్లకు చెందిన పోలీసులు మందీ మార్బలంతో వచ్చి కళ్లు చెదిరే ఖడ్గశిల్పాన్ని తరలించుకుపోయారు. 'ఇది ప్రదర్శనకు పెడితే చూడటానికి జనం విరగబడతారు. అలాంటి సమయంలో ఎవరైనా ఈ శిల్పంలోని ఆయుధాన్నే దొరకబుచ్చుకుని దాడులకు తెగబడితే పరిస్థితి ఏమిటి?' అని పోలీసులు ప్రశ్నిస్తున్నారు. అలాంటి ఉపద్రవాలను నివారించడానికే ఈ ఖడ్గశిల్పాన్ని స్వాధీనం చేసుకున్నామంటూ తమ చర్యను సమర్థించుకుంటున్నారు.

• ఫన్నీ ఫుడ్

## తింటే... భంగుపోటు

భంగుపకోడా

భంగు అంటే గంజాయి... సాధారణంగా దీని ఆకులను ఎండబెట్టి, పొడి చేసి, హుక్కా గొట్టంలో చిటికెడు వేసి పీలుస్తూ సాధువులు, సన్యాసులు, బైరాగులు స్వర్గానికి బెత్తెడు దూరంలో తేలియాడుతుంటారు. నేరుగా తాగితే మత్తులో ఓలలాడతారు. చలవ చేస్తుందని శీతలపానీయాల గంజాయి ఆకులతో తయారు చేసే భంగును కలుపుకుని తాగడం కూడా చూశాం. అయితే, అలా ఇలా కాకుండా భంగుతో వేడివేడిగా పకోడీ తయారు చేసుకుని తింటుంటే వైకుంఠద్వారాల వరకూ వెళ్లిపోవడం ఖాయమంటున్నారు ఒడిశా వాసులు. తీపి పదార్థంగా కాకుండా, శీతల పానీయంగానూ కాకుండా ఇలా గంజాయి గింజల పొడిని పకోడీల పిండిలో వేసుకుని తింటుంటే కన్నులు అరమోడ్పులు కాక చస్తాయా మరి! తరచూ కాదు కానీ, పండగలు పబ్బాలప్పుడు మాత్రం రొటీన్‌కు భిన్నంగా ఈ భంగు పకోడీ చేసుకుంటే ఎలా ఉంటే చూద్దామా మరి! తేలిపోవచ్చు కదా ఉవాచ. కాస్తంత సెనగపిండి, కాసిని బంగాళదుంప ముక్కలు, కాలీఫ్లవర్ ముక్కలు, ఉల్లిపాయముక్కలు, సన్నగా తరిగిన పాలకూర, కప్పున్నర వంకాయ ముక్కలు, వంటసోడా, వాము, దానిమ్మ గింజల పొడి, తగినంత ఉప్పు... ఇవన్నీ కలుపుకుని, అందులో కొంత భంగు వేసి బాగా కలుపుకుని పకోడీల్లా చేసుకుని, సలసలా కాగుతున్న నూనెలో చుయ్ చుయ్ మని వేసి వేడివేడిగా తింటే సరి! పడితే స్వర్గం.. పడక పోతే నరకం...



• బ్లాక్ అండ్ వైట్

## లవ్ యూ బందిపోటూ!



దేవానంద్ సినిమా 'నౌ దో గ్యారా' షూటింగ్ ఢిల్లీ-బాంబే హైవే రోడ్డు మీద జరుగుతున్న రోజులవి. ఒక రోజు సినిమా యూనిట్ శివపురి అనే ప్రాంతంలో బస చేసింది. బందిపోటు దొంగలకు ప్రసిద్ధి చెందిన చంబల్‌కు ఇది గుండెకాయలాంటి ప్రాంతం. అర్ధరాత్రి సమయంలో చప్పుడు కావడంతో వెళ్లి తలుపు తీశాడు దేవానంద్.

ఎదురుగా అంతెత్తు మనిషి. బుర్ర మీసాలు. నడుముకు తూటాల బెల్టు. చేతుల్లో పెద్ద గన్ను. దేవానంద్ ఏవేవో ఊహించుకుంటున్నాడు.

''మీ ఆటోగ్రాఫ్ కావాలి'' అంటూ తన దగ్గరున్న దేవానంద్ ఫోటో ఇచ్చాడు బందిపోటు. దేవానంద్ ఆనందంగా ఆటోగ్రాఫ్ ఇచ్చాడు అనేది వేరే విషయంగానీ...'బందిపోటులలో ఫ్యాన్స్ పోటులు వేరయా' అనే విషయం దేవానంద్‌కు అప్పుడే తెలిసింది!



## స్టార్...స్టార్...

'ఆర్ యూ ఫేమస్?' అని ఐన్‌స్టీన్‌ని అడిగి చూడండి.

చాదస్తం కాకపోతే...అంతపెద్దమనిషి ఐన్‌స్టీన్‌ను పట్టుకొని 'ఆర్ యూ ఫేమస్' అని అడగడం ఏమిటో అనుకోవద్దు. ఇప్పుడు మనం మాట్లాడుకునేది శాస్త్రవేత్త ఐన్‌స్టీన్ గురించి కాదు... సౌత్ అమెరికాలోని టెన్నెసీ జూలో ఉన్న బూడిదరంగు చిలక గురించి. 'ఐయామ్ సూపర్‌స్టార్' అని తనను తాను పరిచయం చేసుకునే ఈ ఐన్‌స్టీన్ పాపులర్ యానిమల్ ప్లానెట్ గేమ్ షోలో 'పెట్ స్టార్' టైటిల్ గెలుచుకొని సెలబ్రిటీగా మారింది.

ఈ ఐన్‌స్టీన్‌లో పెద్ద మిమిక్రీ ఆర్టిస్ట్ దాగి ఉన్నాడు. రకరకాల పక్షులు, జంతువుల గొంతులను అలవోకగా అనుకరిస్తుంది. తన గొంతు నుంచి సుమారు 200 రకాల శబ్దాలను వినిపించగలదు. ఇంప్రెసివ్ వొకబులరీ స్కిల్స్‌తో తన ప్రత్యేకత చాటుకుంటున్న ఐన్‌స్టీన్ జస్ట్... ఈమధ్యే తన 30వ పుట్టిన రోజును ఘనంగా జరుపుకుంది.

# బాపుర్రే!

'ఇవిగో నేను సాధించిన కప్పులు' అంటూ ఆటల్లో గెలిచిన కప్పలను ఇంటికి వచ్చిన అతిథులకు గర్వంగా చూపిస్తుంటాం మనబోటి వాళ్లం. నాగాలాండ్‌లోని 'నాగా' తెగ ప్రజలు మాత్రం... 'ఇదిగో నేను తీసేసిన తలలు' అంటూ ఇంట్లో ఒక వరుసలో జాగ్రత్తగా పేర్చిన పుర్రెలను చూపించేవారు. ఇలా ప్రతి ఇంట్లో శత్రువుల పుర్రెలు ఉండడం అనేది కామన్‌గా ఉండేది. కాలం కాస్తా మరిపోయింది కదా... అందుకని... ప్రతి ఇంట్లో పుర్రెలు ఉండడం ఎందుకని... ఊరికొక 'పుర్రెల ఇల్లు' ఒకటి నిర్మించారు. ప్రతి ఇంట్లో ఉన్న పుర్రెలన్నీ... ఈ పుర్రెల ఇంట్లో ఉంటాయన్నమాట!





• జోకిటీజీ



## అసలు ప్రాబ్లం

బారెడు గడ్డం మీద చిన్న బల్లి కనిపించడం ప్రాబ్లం కాదు. అసలు ప్రాబ్లం ఏమిటంటే, చూసిన తరువాత అది కనిపించకపోవడం!

## విజేతలు

ఒలింపిక్స్‌లో గోల్డ్ మెడల్స్ సాధించిన ముగ్గురి పేర్లు రాయమంటే ఒక విద్యార్థి ఇలా సమాధానం రాశాడు...

1. బాబారామ్ దేవ్....జిమ్నాస్టిక్స్.
2. సల్మాన్‌ఖాన్......షూటింగ్.
3. విజయ్ మాల్యా....లాంగ్ జంప్.

## భవిష్యవాణి

2010లో రజనీకాంత్ 'రోబో' పేరుతో ఒక సినిమా చేశాడు.
3010లో ఒక రోబో 'రజనీకాంత్' పేరుతో ఒక సినిమా చేస్తుంది.

## మా నాయినే!

ఇంటర్వ్యూయర్: నీ టాలెంట్ ఏమిటి?

అప్పారావు: ఎవరైనా క్వశ్చన్ అడిగారో లేదో చాలా స్పీడ్‌గా సమాధానం చెబుతాను.

ఇంటర్వ్యూయర్: 12+24 ఎంతో చెప్పు?

అప్పారావు: 84




ఇంటర్వ్యూయర్: అదేమిటోయ్... ఏది అడిగినా స్పీడ్‌గా సమాధానం చెబుతాను అని కోతలు కోశావు. చిన్న ప్రశ్నకు కూడా సమాధానం తప్పు చెప్పావు!

అప్పారావు: ఆన్సర్ స్పీడ్‌గా చెబుతానన్నానుగానీ... తప్పు చెప్పను అనలేదు కదా సార్.

## ఇంతకీ ఏమిటంటాడు?



మీరు అనేది ఎవరి గురించి?

అదేనండి, అమీర్‌ఖాన్ గురించి.

ఏమిటి మీ సమస్య?

అయితే వినండి...

అమీర్‌ఖాన్ 'త్రీ ఇడియెట్స్' సినిమా తీశాడు. ఆ సినిమాతో ఏంచెప్పాడు?

'మన కలలను నిజం చేయడం కాదు...మన పిల్లలు ఏం కలలు కంటారో వాటిని నిజం చేద్దాం'

'దంగల్' తీశాడు.

'మనం కన్న కలలు పిల్లలు నిజం చేస్తారు. చేయడానికి మొరాయిస్తే బలవంతంగా చేయించుకోవాలి' అని చెప్పాడు.

ఇంతకీ మనం త్రీ ఇడియట్స్ థియరీ ఫాలో కావాలా? దంగల్ ఫాలో కావాలా?!

• హిస్టోరియా

# రాజావారి భుక్తాయాస మరణం

ప్రపంచంలో అరుదుగా కొందరు అదృష్టవంతులు అనాయాస మరణాలు పొందడం అందరికీ తెలిసిన సంగతే. చాలామంది దురదృష్టవంతులు నానా యాతనలు అనుభవించి మరణిస్తుంటారు. ఇలాంటి మరణాలు కూడా లోకంలో సహజమే. అయినంత మాత్రాన ఎంతటి రాజాధిరాజులైనా భుక్తాయాసంతో మరణిస్తారేమిటి అనుకుంటున్నారా..? ఆశ్చర్యంగా ఉన్నా ఇది నిజం. పద్దెనిమిదో శతాబ్దిలో స్వీడన్‌ను పరిపాలించిన అడాల్ఫ్ ఫ్రెడెరిక్ రాజావారు కేవలం భుక్తాయాసంతోనే ఉక్కిరిబిక్కిరై మరణించాడు. అడాల్ఫ్ ఫ్రెడెరిక్ దొరవారు బాల్యం నుంచే భోజనప్రియుడు. నలభయ్యేళ్ల వయసులో గద్దెనెక్కిన తర్వాత ఈ రాజావారు పాలనా వ్యవహారాల కంటే వంటింటి వ్యవహారాలనే ఎక్కువగా పట్టించుకునే వారని ప్రతీతి. నానా పదార్థాలతో ముప్పూటలా రుచికరమైన విందులు ఆరగించడమే పనిగా పెట్టుకుని దాదాపు ఇరవయ్యేళ్లు స్వీడన్‌ను ఏలాడు. ఏదో కుర్రతనంలో రాళ్లు తిన్నా అరుగుతాయి గానీ, వయసు మీద పడుతున్న దశలోనూ కుంభాలకు కుంభాలు లాగిస్తే ఏమవుతుంది? కచ్చితంగా పీకల మీదకొస్తుంది. అడాల్ఫ్ ఫ్రెడెరిక్ రాజావారి విషయంలో జరిగినది ఇదే! ఆయన గారి భోజన ప్రతాపం కుర్రతనంలో బాగానే సాగింది. అయితే, వయసు ముదిరినా జిహ్వాచాపల్యం ఆపుకోలేకపోవడంతో నిత్యం అజీర్తితో బాధపడేవాడు. రాజ వైద్యులు సూచించిన పథ్యపానాలను బేఖాతరు చేసేవాడు. షష్టిపూర్తి దాటిన వయసులో అడాల్ఫ్ ఫ్రెడెరిక్ రాజావారు 1771 ఫిబ్రవరి 12న కూడా యథా ప్రకారం భారీ విందునే ఆరగించాడు. ఆ విందులో చేపలు, పీతలు, సార్‌క్రాట్ (పులియబెట్టిన క్యాబేజీ), కేవియర్, బాదం గింజల గుజ్జు దట్టించి, పాలమీగడతో వడ్డించే ‘సెమ్లా’ అనే స్వీడిష్ సంప్రదాయ మిఠాయి వంటి పదార్థాలను వడ్డిస్తే పీకలదాకా తిన్నాడు. తీపిపై ఇష్టంతో ఏకంగా పద్నాలుగు ‘సెమ్లా’లను లాగించేశాడు. ఆపై పూటుగా షాంపేన్ తాగాడు. అదే అతడి తుది విందు అయింది. భుక్తాయాసంతో ఆపసోపాలు పడుతూ తుదిశ్వాస విడిచాడు.

• సిల్లీ బిజినెస్

# శునకాలకూ బీరు పానీయం

యస్! ఎవ్రీ డాగ్ హ్యాజ్ ఇట్స్ ఓన్ డే! ప్రతి కుక్కకూ ఓ రోజు ఉంటుందని ఇంగ్లిష్ నానుడి. లక్కు తిరగాలే గానీ, కుక్కలకూ వాటి రోజు తప్పకుండా వస్తుందని శునక ప్రేమికుల నమ్మకం. అదేమిటో గానీ విచిత్రంగా నమ్మకాలు కూడా ఒక్కోసారి నిజమైపోతూ ఉంటాయి. ఇక్కడి ఫొటో పరిశీలిస్తే మీకు ఆ విషయం కాస్త అర్థమవుతుంది లెండి. ఎంతసేపూ పాడు మనుషులకేనా బారూ బీరూ... కుక్కలేం తక్కువ చేశాయని అనుకుంది జెన్నీ బ్రౌన్ అనే అమెరికన్ శునక ప్రేమికురాలు. రకరకాల ప్రయోగాలు చేసి కుక్కల కోసం చక్కని బీరు తయారు చేసింది. ఇది తన పెంపుడు కుక్కకే పరిమితం కాకుండా ఇతరుల పెంపుడు కుక్కలకూ చేరువ చేయాలనే ఉద్దేశంతో ఏకంగా ఒక కంపెనీ పెట్టింది. ‘బౌజర్ బీర్’ పేరిట శునకాల బీరును ఆన్‌లైన్‌లో విక్రయిస్తోంది. సాటి శునక ప్రేమికుల నుంచి ఈ బీరుకు ఆర్డర్లు ఇబ్బడి ముబ్బడిగానే వచ్చి పడుతున్నాయి. కుక్కలు బీరు తాగితే అవి ఊరుకుంటాయా..? వాటికి తిక్కరేగి పిక్క పీకితే దిక్కేమైనా ఉంటుందా? అని బెంగపడకండి. ఈ బీరులో ఆల్కహాల్ ఏమాత్రం ఉండదు. దీని ధర ఒక్కో సీసాకు ఆరు డాలర్లు (సుమారు రూ.388) మాత్రమే.









# అ- అమ్మ ; ఆ- ఆవు

ఈ కాలం పిల్లలకు అంతరిక్ష విజ్ఞానం తెలుసు. కంప్యూటర్ నాలెడ్జ్‌కి కొదవే వుండదు. సెల్‌ఫోన్‌లు ఎలా పని చేస్తాయో, ఎన్ని మోడళ్లున్నాయో, ఏ మోడల్ సెల్‌లో ఏయే ఫీచర్లున్నాయో ఇట్టే చెప్పేస్తారు. అయితే పాలెక్కడి నుంచి వస్తాయంటే మాత్రం దిక్కులు చూస్తారు. పట్టణాలలో పుట్టి పెరిగిన ఆ చిన్నారులకు గేదెలు లేదా ఆవుల గురించి తెలియకపోవడం లేదా వారు వాటిని చూడకపోవడమే అందుకు కారణం. కేవలం మన దేశంలోనే కాదు, విదేశాలలోనూ ఇదే పరిస్థితి. ఇటువంటి స్థితి పిల్లలకే కాదు,పెద్దలకూ రాకూడదనే ఉద్దేశంతో స్విట్జర్లాండ్‌కు చెందిన సిబిలీ జ్యాగర్ట్ అనే ఆవిడ చిన్నారులను పోగు చేసి, వారిని తమ డెయిరీ ఫామ్‌కు తీసుకు వెళ్లి ఆవులు, గేదెలను చూపిస్తూ, వాటితో సహవాసం చేయిస్తూ తువ్వాయిలతో అదేనండీ... ఆవుదూడలు, గేదెదూడలు తల్లుల దగ్గర ఆబగా పాలు తాగుతుంటే చూపిస్తూ వారికి ప్రకృతి పాఠాలు నేర్పిస్తోంది. గోమాతలు దూడలకు జన్మనిస్తూ ప్రసవ వేదన పడటం, దూడలు పుట్టాక వాటిని ప్రేమగా నాకుతూ మాతృత్వపు ఆనందాన్ని తనివితీరా అనుభవిస్తుంటే చూపిస్తూ వారికి కొత్త తరహా క్లాసులు తీసుకుంటోంది. ఆమె చెప్పే తరగతులకు పిల్లలతోబాటు పెద్దలు కూడా విచ్చేసి, గోమాతలతో గడుపుతూ, వాటికి మేత పెడుతూ, వాటిని కావలించుకుంటూ వాటికి దగ్గరగా మెలగడం వల్ల కలిగే ఆనందాన్ని, ప్రయోజనాలను స్వయంగా అనుభవిస్తున్నారు. ఆవులతో సహజీవనం చేయడం వల్ల మానసిక ఒత్తిడి నుంచి బయటపడవచ్చునని మనస్తత్వశాస్త్రవేత్తలు చెప్పిన విషయం నిజ్జంగా నిజమేనంటున్నారు ఈ క్లాసులకు హాజరవుతున్నవారు.

మే 3న ప్రపంచ పత్రికా స్వేచ్ఛా దినోత్సవం సందర్భంగా...

అల్లరి చేయాల్సిన చిచ్చర పిడుగులు అక్షరాలకు పదును పెడుతున్నారు.
పత్రికల్లోని శీర్షికలను కూడబలుక్కుని చదివే వయసులోనే
పతాక శీర్షికలను నిర్దేశిస్తున్నారు.
చిన్నపిల్లలే కదా, ఏవో కాకమ్మ కథలు రాసుకుంటార్లే అనుకుంటే పొరపాటే!
మెయిన్‌స్ట్రీమ్ మీడియాకు సైతం చిక్కని కథనాలను
అలవోకగా దొరకబుచ్చుకుంటున్నారు.
ఎంతటి ఘనాపాటీ నాయకులనైనా జంకూ గొంకూ
లేకుండా ఇంటర్వ్యూలు చేసేస్తున్నారు.
పెద్దల పత్రికలకు సుద్దులు చెప్పే రీతిలో తమవైన పత్రికలను
అద్భుతంగా తీర్చిదిద్దుకుంటున్నారు.
కలాలనే ఆయుధాలుగా చేసుకున్న ఈ లిటిల్ సోల్జర్స్ ఇండియాలోనే కాదు,
ఇంకొన్ని దేశాల్లోనూ ఉన్నారు.
పత్రికా స్వేచ్ఛా దినోత్సవం సందర్భంగా వీళ్లు సాధిస్తున్న విజయాలను
మీ ముందు ఉంచుతున్నాం.

# లిటిల్ సోల్జర్స్

ప్రతీకాత్మక చిత్రం

## బాలల గొంతు... బాలక్‌నామా

'బాలక్‌నామా'... ఇది అచ్చంగా బాలల పత్రిక. బాలల కోసం స్వయంగా బాలలే నిర్వహిస్తున్న పదహారు పేజీల పూర్తిస్థాయి టాబ్లాయిడ్ మాసపత్రిక. ఇంగ్లిష్, హిందీ భాషల్లో వెలువడుతోంది. దీని సర్క్యులేషన్ హిందీలో ఐదువేల కాపీలు, ఇంగ్లిష్‌లో మూడువేల కాపీలు. 'చేతన' అనే స్వచ్ఛంద సంస్థ సహకారంతో ఢిల్లీలోని వీధిబాలలు, బాల కార్మికులు పద్నాలుగేళ్ల కిందట దీనిని ప్రారంభించారు. ఈ పత్రికకు ఢిల్లీలోనే పద్నాలుగు మంది పూర్తిస్థాయి రిపోర్టర్లు పని చేస్తున్నారు. వీళ్లందరూ బాలలే. వీళ్లే కాకుండా అడపా దడపా రాసే ఔత్సాహిక బాలలు కూడా దీనికి తరచుగా కథనాలను అందిస్తూ ఉంటారు. మొదట ఢిల్లీలోనే ప్రారంభమైనా, ఇప్పుడిది హర్యానా, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్ రాష్ట్రాలకూ విస్తరించింది. ఈ ప్రాంతాల్లో కూడా కొందరు పూర్తిస్థాయి రిపోర్టర్లుగా 'బాలక్‌నామా' కోసం పనిచేస్తున్నారు. ఇందులో పనిచేసే బాల రిపోర్టర్లలో కొందరికి తగిన అక్షరజ్ఞానం కూడా లేదు. తాము విన్నవి, కన్నవి వాళ్లు చెబుతుంటే అక్షరజ్ఞానం గల మిగిలిన బాలలు వారు చెప్పే విషయాలను రాసుకుని, వాటి

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## హార్మోన్ సమస్యలకు సమర్థవంతమైన చికిత్సలు

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



ఈ మధ్యకాలంలో చాలామంది థైరాయిడ్, పీ.సి.ఓ.డి., సంతానలేమి మరియు డయాబెటిస్ వంటి దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలతో ఎక్కువగా బాధపడటం జరుగుతోంది. ఈ విధమైన ఆరోగ్య సమస్యలు హార్మోన్‌ల అసమతుల్యత వలన ఏర్పడతాయని చాలామందికి తెలియదు. ఇలాంటి అసమతుల్యతలు ఏర్పడటానికి కేవలం చిన్న కారణమైనా చాలు - అవి తీవ్రమైన దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలకు దారి తీస్తాయి. కాబట్టి వీటి పట్ల అవగాహన పెంచుకోవడం వలన ఇలాంటి వ్యాధుల బారిన పడకుండా మనల్ని మనం కాపాడుకోవచ్చు.

హార్మోన్‌లు అనేవి శరీరంలోని ఎండోక్రైన్ గ్రంథుల నుండి ఉత్పత్తి అయ్యే రసాయన వాహకాలు. ఇవి శరీరంలో ఒక ప్రాంతపు కణజాలం, అవయవాల నుండి ఉత్పత్తి అయి - వివిధ శరీర భాగాలకు రక్తప్రసరణ ద్వారా చేరుకుని, నిర్దిష్ట అవయవాలను ప్రభావితం చేయటం ద్వారా జీవక్రియల సమతుల్యతకు తోడ్పడతాయి. ఇవి శరీరంలో సూక్ష్మమోతాదులో ఉత్పత్తి అయినప్పటికీ, శరీరంలోని సాధారణ జీవక్రియలైన జీర్ణక్రియ మొదలుకొని శారీరక-మానసిక ఎదుగుదల, ప్రత్యుత్పత్తి, మానసిక సమతుల్యత వంటి అన్ని జీవక్రియలపై వీటి ప్రభావం ఉంటుంది. ఏ కారణం చేతనైనా ఇవి అసమతుల్యతకు గురి అయితే, అవి తీవ్రమైన ఆరోగ్య సమస్యలుగా పరిణమిస్తాయి.

**వివిధ హార్మోన్‌లు - వాటి అసమతుల్యత వలన కలిగే వ్యాధులు: థైరాయిడ్ హార్మోన్‌లు(T3, T4):** ఇవి థైరాయిడ్ గ్రంథి నుండి ఉత్పత్తి అవుతాయి. ఈ హార్మోన్‌ల ప్రభావం 90% వరకు మానవుని జీవక్రియలపై ఉంటుంది. వీటి అసమతుల్యత వలన హైపోథైరాయిడ్, హైపర్‌థైరాయిడ్, గాయిటర్ వంటి దీర్ఘకాలిక జబ్బులు కలుగుతాయి. **హైపోథైరాయిడిజం:** థైరాయిడ్ హార్మోన్‌లు తక్కువ మోతాదులో ఉత్పత్తి కావడం వలన ఇది ఏర్పడుతుంది. **లక్షణాలు:** బరువు పెరగటం, జుట్టు రాలటం, నీరసం, మతిమరుపు, ఋతుచక్ర సమస్యలు మొదలైన లక్షణాలు కనిపిస్తాయి. **హైపర్‌థైరాయిడిజం:** శరీరంలో థైరాయిడ్ హార్మోన్‌లు ఎక్కువ మోతాదులో ఉత్పత్తి అవడం వలన ఈ సమస్య ఏర్పడుతుంది. **లక్షణాలు:** బరువు తగ్గడం, నీరసం, గుండెదడ, కాళ్ళు-చేతులు వణకడం మొదలగు లక్షణాలు కనిపిస్తాయి. **గాయిటర్:** గొంతు ముందుభాగంలో ఉండే థైరాయిడ్ గ్రంథి వాపునకు గురి కావడాన్ని గాయిటర్ అంటారు. ఇది ముఖ్యంగా అయోడిన్ అనే మూలకం యొక్క లోపం వలన కలుగుతుంది. ఇది హైపోథైరాయిడ్ లేదా హైపర్‌థైరాయిడ్ సమస్యలతో కూడుకుని ఉండవచ్చు. **హోమియోకేర్ చికిత్స:** ప్రస్తుత పరిస్థితులలో మానవుని ప్రకృతి విరుద్ధమైన జీవన విధానం, అధిక మానసిక ఒత్తిడికి గురికావటం, వ్యాయామ లోపం వలన ఎక్కువ శాతం థైరాయిడ్ వ్యాధుల బారిన పడటం జరుగుతోంది. థైరాయిడ్ సమస్యలకు జీవితకాలం మందులు వాడే అవసరం లేకుండా, ఈ సమస్య రావటానికి గల మూలకారణాన్ని గుర్తించి, వ్యక్తి శారీరక-మానసిక తత్వానికి అనుగుణంగా సరైన హోమియో వైద్యచికిత్స ద్వారా ఎలాంటి థైరాయిడ్ హార్మోన్ సమస్యనైనా సంపూర్ణంగా నయం చేయవచ్చు.




**స్త్రీలలో ఉండే హార్మోన్‌లు:** ఈస్ట్రోజెన్, ప్రొజెస్టిరాన్, ప్రొలాక్టిన్, ఆక్సిటోసిన్ హార్మోన్‌లు స్త్రీలలో రజస్వల, ఋతుచక్రం, ద్వితీయ లైంగిక లక్షణాలు,సంతానోత్పత్తి మరియు ప్రసవంలో ఉపకరిస్తాయి. ఈ హార్మోన్‌ల అసమతుల్యత వలన స్త్రీలలో ఋతుచక్ర సమస్యలు (పీసిఓడి), హిర్సుటిజం (అవాంఛిత రోమాలు) మరియు సంతానలేమి సమస్యలు ఏర్పడతాయి. స్త్రీలలో మెనోపాజ్ మరియు రజస్వల అయ్యే సమయంలో హార్మోన్‌ల ప్రభావం ఎక్కువగా ఉంటుంది. మెనోపాజ్‌లో హార్మోన్‌ల హెచ్చుతగ్గుల వలన Hot Flushes, మానసిక అశాంతి, నీరసం, కీళ్ళ నొప్పులు మరియు కండరాల నొప్పులు ఉత్పన్నమవుతాయి.

**పురుషులలో ఉండే హార్మోన్‌లు:** TSH, LH మరియు టెస్టోస్టీరాన్ హార్మోన్‌లు పురుషులలో శుక్రకణాల ఉత్పత్తికి తోడ్పడతాయి. ఈ టెస్టోస్టీరాన్ హార్మోన్‌ల అసమతుల్యత వలన శీఘ్రస్కలనం, అంగస్థంభన సమస్యలు, శుక్రకణాల సమస్యలు ఏర్పడటం వలన సంతానలేమి సమస్యలు కలుగుతాయి. **ప్రొలాక్టిన్ హార్మోన్:** ఈ హార్మోన్ ముఖ్యంగా స్త్రీలలో ప్రసవానంతరం పాల ఉత్పత్తికి ఉపకరిస్తుంది. సాధారణంగా ఈ హార్మోన్ గర్భధారణ సమయంలో మరియు ప్రసవానంతరం కూడా ఎక్కువగా ఉత్పత్తి అవుతుంది. ఈ పరిస్థితులు మినహా స్త్రీలలో ఈ హార్మోన్‌లు ఎక్కువ స్థాయిలో ఉత్పత్తి అయితే ఈస్ట్రోజన్ హార్మోన్ స్థాయిలు తగ్గిపోయి, అండం విడుదల లోపాలు ఏర్పడతాయి. కొంతమందిలో అండం విడుదల సక్రమంగా జరిగినా కూడా, ప్రొజెస్టిరాన్ హార్మోన్ ఉత్పత్తి జరగకపోవచ్చు. దీనివలన గర్భాశయం పిండ ప్రతిస్థాపనకు సిద్ధంగా లేకపోవడం వలన గర్భధారణ జరగక సంతానలేమి కలుగుతుంది. **పురుషులలో:** ఈ హార్మోన్‌లు ఎక్కువ స్థాయిలో ఉత్పత్తి అయితే టెస్టోస్టీరాన్ హార్మోన్‌ల స్థాయిలు తగ్గి - తద్వారా శుక్రకణాల ఉత్పత్తి తగ్గిపోవడం మరియు లైంగిక సమస్యలు కలుగుతాయి. **హోమియోకేర్ చికిత్స:** హార్మోన్ సమస్యలు ఒకదానితో మరొకటి అనుసంధానమై ఉంటాయి. వీటికి హోమియోకేర్ వైద్యంతోఎలాంటి హార్మోన్‌లు బయట నుండి ఇవ్వకుండానే హార్మోన్ అసమతుల్యతలను సరిచేయటం వలన ఎలాంటి దుష్ప్రభావాలు లేకుండా ఋతుచక్ర సమస్యలు, పీ.సి.ఓ.డి. సమస్యలు, సంతానలేమి మరియు శుక్రకణ సమస్యలను సంపూర్ణంగా నయం చేయవచ్చు.

**డయాబెటిస్ ఇన్‌సెపిడస్:** ADH (యాంటీ డయూరెటిక్ హార్మోన్) లోపం వలన వస్తుంది. దీనిని అతిమూత్ర వ్యాధి అంటారు. **డయాబెటిస్ మెల్లిటస్:** ఇది క్లోమ గ్రంథి ఉత్పత్తి చేసే ఇన్సులిన్ లోపం వలన లేదా తక్కువ మోతాదులో ఇన్సులిన్ ఉత్పత్తి కావడం వలన కలుగుతుంది. ఇది రెండు రకాలు. **టైప్-I డయాబెటిస్:** ఇది ఇన్సులిన్ ఉత్పత్తి కాకపోవడం వలన వస్తుంది. దీనిని జువెనైల్ డయాబెటిస్ అని అంటారు. ఈ వ్యాధి ఉన్నవారు పూర్తిగా ఇన్సులిన్ ఇంజెక్షన్లపై ఆధారపడవలసి వస్తుంది. **టైప్-II డయాబెటిస్:** ఇది ఇన్సులిన్ ఉత్పత్తి తగ్గటం వలన వస్తుంది మరియు ఎక్కువగా 30 సం॥లు పైబడిన వారిలో వచ్చే అవకాశం ఉంటుంది. కానీ ఈ మధ్యకాలంలో యుక్తవయస్సులో ఉన్నవారికి కూడా ఇది రావటం జరుగుతోంది. డయాబెటిస్‌తో బాధపడే వారి రక్తంలోని చక్కెర శాతాన్ని సరిగ్గా నియంత్రణ చేయకపోవడం వలన దీర్ఘకాలంలో డయాబెటిక్ నెఫ్రోపతి, డయాబెటిక్ న్యూరోపతి, రెటినోపతి, గుండె సమస్యలు, అంగస్థంభన సమస్యల లాంటి కాంప్లికేషన్‌లు వస్తాయి. **హోమియోకేర్ చికిత్స:** డయాబెటిస్‌ను తొందరగా గుర్తించి, తొలిదశలోనే హోమియోకేర్ ప్రత్యేక హార్మోన్ సెల్ మరియు కాన్స్‌టిట్యూషనల్ విధానం ద్వారా దీర్ఘకాలికంగా డయాబెటిస్‌తో బాధపడేవారిలో - ఎలాంటి దుష్ఫలితాలు లేకుండా వ్యాధిని అదుపులో ఉంచటమే కాకుండా కాంప్లికేషన్‌లను నివారించవచ్చు.

**హార్మోన్ సమస్యలకు హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హోమియోకేర్ సొంతమైన ప్రత్యేక 'హార్మోన్ సెల్' మరియు జెనెటిక్ కాన్స్‌టిట్యూషనల్ సిమిలిమం పద్ధతుల ద్వారా అన్ని హార్మోన్ సమస్యలకు ఖచ్చితమైన మరియు ఎటువంటి దుష్ఫలితాలు లేని వైద్యం అందించటం ద్వారా ఇక జీవితంలో మరోసారి తిరగబెట్టకుండా హార్మోన్ సమస్యలను సంపూర్ణంగా నయం చేసే అవకాశం ఉంటుంది.

ADVT

టోల్ ఫ్రీ 1800 108 1212 | కన్సల్టేషన్ ఉచితం 955 000 1199 | www.homeocare.in




ఆధారంగా తగిన కథనాలను రూపొందిస్తుంటారు. బాలలు రాసే కథనాలకు మెరుగులు దిద్దడంలో 'చేతన' కార్యకర్తలు అప్పుడప్పుడు సహాయం చేస్తూ ఉంటారు. అయితే, కథనాల రూపకల్పనలో, శీర్షికల ఎంపికలో ఈ బాలలే ఉమ్మడిగా తుది నిర్ణయాలు తీసుకుంటారు. 'ప్రపంచంలోనే ఇది అత్యంత అరుదైన పత్రిక. వీధిబాలలు, బాల కార్మికులు నడిపించే ఏకైక పత్రిక ఇదే' అని 'ఇండియా టుడే' రెండేళ్ల కిందట ఒక ప్రత్యేక కథనాన్నే ప్రచురించింది. పలు అంతర్జాతీయ పత్రికలు, టీవీ చానళ్లు కూడా 'బాలక్‌నామా'పై తమ కథనాల్లో ప్రశంసలు కురిపించాయి. బాల రిపోర్టర్లు ఇందులో పనిచేస్తూనే 'చేతన' సాయంతో తమ చదువు సంధ్యలను సాగించుకుంటున్నారు.

## ఎడిటర్స్ స్టోరీ



బాలలు నడిపే బాలల పత్రికే అయినా, 'బాలక్‌నామా' నిర్వహణ అంతా పక్కా ప్రొఫెషనల్‌గా ఉంటుంది. ప్రధాన పత్రికల తరహాలోనే ఎడిటోరియల్ సమావేశాలు జరుగుతుంటాయి. కథనాల ఎంపికపై సుదీర్ఘంగా చర్చోపచర్చలు జరుగుతుంటాయి. పదో తరగతి చదువుకునే చాందినీ అనే బాలిక దీనికి సంపాదకురాలిగా ఉంటోంది. కథనాలపై ఆమె ఎప్పటికప్పుడు రిపోర్టర్లకు సూచనలు ఇస్తూ ఉంటుంది. 'చేతన' ఆసరాతోనే ఆమె ఈ స్థాయికి చేరుకుంది. చాందినీకి నాలుగేళ్ల వయసు ఉన్నప్పుడు ఆమె కుటుంబం బరేలీ నుంచి ఢిల్లీకి వలస వచ్చింది. తల్లిదండ్రులతో కలసి వీధుల్లో తిరుగుతూ ఆమె తాడుపై నడవడం వంటి గారడీ విద్యలు ప్రదర్శించేది. అయితే, 2008లో ఆమె తండ్రి మరణించడంతో పరిస్థితి తారుమారైంది. చాందినీ తల్లి ఇళ్లలో పనిచేసేది. తల్లికి ఆసరాగా ఆమె వేన్నీళ్లకు చన్నీళ్లలా వీధుల్లో తిరుగుతూ చెత్త ఏరుకుని అమ్ముకునేది. 'చేతన' కార్యకర్తలు ఆమెను చేరదీసి ఓపెన్ స్కూల్‌లో నమోదు చేయించారు. రిపోర్టర్‌గా తర్ఫీదు ఇచ్చారు. జర్నలిజంలో మెలకువలను నేర్చుకుని ఆరేళ్ల వ్యవధిలోనే ఆమె ఎడిటర్ స్థాయికి ఎదిగింది.

## పాలస్తీనాలో పసి పాత్రికేయురాలు



నిరంతరం బాంబుల మోతతో దద్దరిల్లే పాలస్తీనాలో పనిచేయడానికి ఎంతటి బడా బడా జర్నలిస్టులైనా గుండెలు అరచేతుల్లో పెట్టుకుంటారు. అలాంటిది పదేళ్ల పసిపిల్ల జన్నా జీహాద్ అయ్యద్ ఏమాత్రం జంకుగొంకు లేకుండా పాలస్తీనాపై ఇజ్రాయెల్ సాగిస్తున్న అరాచకాలను ప్రపంచానికి వెల్లడించేందుకు నడుం బిగించింది. కెమెరాను తన ఆయుధంగా చేసుకుని, తాను కళ్లారా చూసిన దాడులను, రక్తపాతాన్నీ ఎప్పటికప్పుడు వివిధ వార్తాసంస్థలకు అందించడం మొదలుపెట్టి అంతర్జాతీయ వార్తాసంస్థల దృష్టిని ఆకట్టుకుంది. పాలస్తీనాలో ఇజ్రాయెల్ ఆక్రమిత ప్రాంతమైన వెస్ట్‌బ్యాంక్‌లోని నబీ సలే గ్రామంలో పుట్టిన జన్నా... తనకు ఊహ తెలిసినది మొదలు తన ప్రాంతంలో జరిగే మారణకాండను కళ్లారా చూస్తూనే ఉంది. ఆమె కుటుంబంలో ఎవరూ జర్నలిస్టులు కాదు. ఆమె బాబాయి ఒక



కెమెరామన్. అతడి వద్ద కెమెరా వాడటం తెలుసుకుంది. మొదటిసారిగా ఏడేళ్ల వయసులో తన ప్రాంతంలో జరిగిన దాడులను చిత్రీకరించి వార్తాసంస్థలకు పంపింది. సైనికులను, క్షతగాత్రులను ఇంటర్వ్యూ చేయడం, తోటి పిల్లలతో కలసి ఇజ్రాయెల్ వ్యతిరేక నిరసన ప్రదర్శనల్లో పాల్గొనడం వంటి కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొంటూ అనతికాలంలోనే అంతర్జాతీయ మీడియా దృష్టిని ఆకర్షించింది. 'చాలామంది జర్నలిస్టులు పాలస్తీనా గొంతును బయటి ప్రపంచానికి వినిపించడం లేదు. అలాంటప్పుడు నేనే ఎందుకు ఆ పని చేయకూడదనుకున్నా. అందుకే మా గ్రామంలోను, పరిసరాల్లోను జరుగుతున్న దాడులను, మా ప్రజలపై జరుగుతున్న అఘాయిత్యాలను నాకు చేతనైన రీతిలో చిత్రీకరిస్తూ వార్తాసంస్థలకు పంపుతున్నా. కెమెరా కన్నే నా గన్ను.' అని చిన్నారి జన్నా 'అల్ జజీరా' వార్తాసంస్థకు ఇచ్చిన ఇంటర్వ్యూలో చెప్పడం విశేషం.

## స్థానిక నేరాలపై చిన్నారి లీ'షాక్'

పట్టుమని పదేళ్లయినా లేని అమెరికన్ చిన్నారి హిల్డే కేట్ లిషాక్ మెయిన్‌స్ట్రీమ్ మీడియా కంటే ముందుగానే ఒక హత్య సంఘటనను వెలుగులోకి తెచ్చింది. పెన్సిల్వేనియా రాష్ట్రంలో తాను నివాసం ఉండే సీన్స్‌గ్రోవ్ పట్టణంలో జరిగింది ఆ సంఘటన. గత ఏడాది ఏప్రిల్ రెండో తేదీన ఆమె వార్తల సేకరణ కోసం ఎప్పట్లాగానే స్థానిక పోలీస్ స్టేషన్‌కు వెళ్లింది. స్టేషన్ అధికారితో ఆమె మాట్లాడుతుండగానే, హత్య సంఘటనపై ఫోన్‌కాల్ వచ్చింది. పోలీసులు తర్జన భర్జనలు పడుతుండగానే హిల్డే స్వయంగా సంఘటనా స్థలానికి వెళ్లి మరీ వివరాలను సేకరించింది. హుటాహుటిన ఇంటికి చేరుకుని ముందుగా ఈ కథనాన్ని తన పత్రికకు సంబంధించిన




వెబ్‌సైట్‌లో వీడియోతో సహా పోస్ట్ చేసింది. తర్వాత తన పత్రికలో వివరంగా కథనాన్ని ప్రచురించింది. చిన్నపిల్ల ఏదో ముచ్చటగా నడుపుకొనే పత్రికలో ఏవో ఆటపాటలు, చదువు సంధ్యల కథనాలు రాసుకోవచ్చు గానీ, ఏకంగా క్రైమ్‌స్టోరీలు ప్రచురించడమా! అంత చిన్నపిల్లను హత్య జరిగిన చోటుకు ఆమె తల్లిదండ్రులు ఎలా వెళ్లనిచ్చారు..? అంటూ పెన్సిల్వేనియా పెద్దమనుషులు కొందరు నోళ్లు నొక్కుకున్నారు. నొసలు చిట్లించారు. దీనిపై ఎవరెలా స్పందించినా 'ఐ డోంట్ కేర్' అని నిక్కచ్చిగా తేల్చి చెబుతోంది హిల్డే. 'ఏం చిన్నపిల్లనైనంత మాత్రాన పెద్దపెద్ద కథనాలు రాయడం తప్పవుతుందా?' అని ప్రశ్నిస్తోంది. స్థానికంగా జరిగే ఎలాంటి సంఘటనలు, కార్యక్రమాలనైనా తాను రిపోర్ట్ చేస్తానని, అయితే క్రైమ్ కథనాలు రాయడమంటేనే తనకు ఎక్కువ ఇష్టమని చెబుతుందామె.

### ఎలా జర్నలిస్ట్ అయ్యిందంటే..!

హిల్డే తండ్రి మాథ్యూ లిషాక్ 'న్యూయార్క్ డెయిలీ న్యూస్'లో జర్నలిస్టు. తండ్రి ప్రభావంతోనే హిల్డే జర్నలిజంపై ఆసక్తి పెంచుకుంది. వార్తాకథనాల కోసం పరిశోధనలు సాగించే సమయంలో మాథ్యూ చిన్నారి హిల్డేను తనతో పాటే కార్యాలయానికి తీసుకు వెళ్లేవాడు. అక్కడ ఆమె తన తండ్రి చేసే పనులను ఆసక్తిగా గమనించేది. కొన్నాళ్లకు మాథ్యూ కుటుంబం న్యూయార్క్ నుంచి స్వస్థలమైన సీన్స్‌గ్రోవ్‌కు చేరుకుంది. జర్నలిజంపై కూతురి ఆసక్తి గమనించి 'ఆరెంజ్‌న్యూస్'ను కుటుంబ పత్రికలా రూపొందించేలా ప్రోత్సహించాడు. తొలుత ఇది రాత పత్రికగానే మొదలైంది. క్రమంగా ఫేస్‌బుక్ పేజీకి, యూట్యూబ్ చానెల్‌కు విస్తరించింది. క్రమంగా 2014 నాటికి... అంటే హిల్డేకు ఎనిమిదేళ్ల వయసు వచ్చే నాటికి ఇది స్థానిక పత్రిక స్థాయికి ఎదిగి, ప్రింట్ ఎడిషన్‌గా వెలువడటం మొదలైంది.

వాస్తు విద్వాన్, సాయిశ్రీ
**గౌ॥డా॥ దంతూరి పండరీనాథ్**

వాస్తు వీక్షణం



## స్వజల వేధ

**తమ** గృహము యొక్క ఆవరణలో కురిసిన వర్షపు నీరు, భూమి ఉపరి తలము నుండి ప్రవహిస్తూ ఆగ్నేయము, నైరుతి, వాయవ్య మూలల నుండి గాని, దక్షిణ, పశ్చిమ దిక్కుల నుండి బయటకి ప్రవహించుట వలన కలుగు దోషము **'స్వజల వేధ'** దోషముగా పరిగణింపబ డుతుంది. వాడుక నీరు, మురుగునీరు కూడా కాలువల ద్వార ఇంటి నుండి పైన పేర్కొనబడిన మూలలు/ దిక్కుల నుండి బయటకి ప్రవహించినను ఈ దోషము కలుగుతుంది. భూమి (క్షేత్రము) పశ్చిమ పల్లము, దక్షిణ పల్లము, నైరుతి పల్లము ఉన్నప్పుడు మాత్రమే ఈ దోషముకలుగు నవకాశముంటుంది.

**వాడుక నీరు కాని, వర్షపు నీరు కాని, మురుగు నీరు కాని భూగర్భము (under ground)లో నుండి ప్రవ హిస్తూ గృహావరణ నుండి బయటకు వచ్చినట్లయితే కొంత వెసులుబాటు ఉంటుంది. పశ్చిమ వాయువ్యము నుండి గాని, దక్షిణ అగ్నేయము నుండి గాని పైపులైను ద్వార నీరు బయటకు రావడం వలన దోషముండదు.** మిగితా దిక్కుల్లోకి (పశ్చిమము, దక్షిణము, ఉత్త రము, ఉత్తర వాయువ్యము, పశ్చిమ నైరుతి, దక్షిణ నైరుతి, తూర్పు ఆగ్నే యం)లో నుండి పైపులైను ద్వార నీరు బయటకురావటం వలన కూడా ఈ దోషము కలుగుతుంది. ఒక ఇంటికి తూర్పు దిక్కున మరియు ఉత్తర దిక్కున ఇండ్లు ఉన్నప్పుడు వర్షపు నీరు తూర్పు ఉత్తర దిక్కుల నుండి బయటకు పంపిం చడం సాధ్యం కాదు. అయినప్పటికి స్థలాన్ని ఈశాన్య పల్లముగా సవరించి అటునుండి (Under Ground) పైపు లైన్లు వేసి పశ్చిమ వాయువ్య మూల నుండి గాని, దక్షిణ ఆగ్నేయ మూల నుండి గాని, పైప్‌లైన్ల ద్వార నీటిని బయ టకు పంపించటం వలన 'స్వజల వేధ' అను వాస్తు దోషము కలుగ కుండ గృహాన్ని రక్షించుకోవచ్చు.

ఈ వేధ దోషము వలన ఆ ఇంట నివా సించువారు దీర్ఘ వ్యాధులతో బాధప డుతూ ఉంటారు. అంతేగాక మానసిక రుగ్మతలు, ధనహాని మొదలగు దుష్ఫలి తాలు కూడా కలుగవచ్చును. ఇటువంటి దుష్ఫలితాలు పునరావృతం అవుతుంటే, ఎవరైనా సరే వారి ఇంటికి ఇటువంటి **'స్వ జల వేధ'** వాస్తు దోషము ఉన్నదేమోనని స్వయంగా పరిశీలించుకొనుట చాలా అవ సరం. ఒక వేళ ఇటువంటి దోషముంటే వాస్తు నిపుణుల పర్యవేక్షణలో సరిదిద్దుకో వటం వలన తప్పకుండా మంచి ఫలితా లను పొందవచ్చును.

### నైరుతి మూలన బాత్‌రూమ్!

**... నైరుతి మూలన కట్టిన అటాచ్డ్ బాత్‌రూమ్, లెట్రిన్ – దక్షిణ, పడమర ప్రహారి గోడల మీద పెంచి కట్టుకోవచ్చా?**

**– రామరావు, నల్లగొండ జిల్లా.**

1) కట్టబడి స్థలంలో నైరుతి మూలన బాత్‌రూమ్ నిర్మించకుడదు. 2) ఆవర ణలో నైరుతి మూలన ప్రహరీ గోడలనా నుకొని గది / బాత్‌రూమ్ / స్టోర్‌రూమ్ నిర్మించవచ్చును. ప్రహరి గోడలనానించ కుండా కూడా నిర్మించుకోవచ్చును. అయితే **ఆ గది ప్రధాన గృహానికి తగల కుండా కనీసం 3అడుగుల ఖాళీ స్థలం ఉండాలి.** 3) ఆవరణలో కట్టే ఏ గది కూడా స్టోర్, బాత్‌రూమ్ మొదలగునవి ప్రధాన గృహానికి తగలకూడదు. అవి అటాచ్‌డ్ (బాత్) రూమ్స్ అవగూడదు. 4) నైరుతి మూలన కట్టే ఏగదులైనా సరే, ఏ సవరణలైనా సరే, పనిలో పొడిగింపు లేకుండా ఒకటి రెండు రోజుల్లో పూర్తి చేయాలి. వాస్తు నిపుణుల పర్యవేక్షణ ఎంతో మేలు చేస్తుంది.

# పాత్రికేయులపై దాడులు, దమనకాండలు

పేరుకు మన భారతదేశం అతిపెద్ద ప్రజాస్వామ్య దేశమే అయినా పత్రికా స్వేచ్ఛ మాత్రం ఇక్కడ అంతంత మాత్రమే. భారతదేశం మాత్రమే కాదు, చాలావరకు 'శాంతియుత' ప్రజాస్వామిక దేశాల్లో దాదాపు ఇలాంటి పరిస్థితులే ఉన్నాయి. 'రిపోర్టర్స్ విత్‌ఔట్ బోర్డర్స్' వెల్లడించిన వివరాల ప్రకారం 2015లో ప్రపంచవ్యాప్తంగా 110 మంది పాత్రికేయులు విధినిర్వహణలో ఉండగా హత్యకు గురయ్యారు. మరో 43 మంది పాత్రికేయులు అనుమానాస్పద పరిస్థితుల్లో మరణించారు. వీరే కాకుండా సోషల్ మీడియా ద్వారా మరుగ్గా వాస్తవాలను వెలుగులోకి తెస్తున్న 27 మంది సిటిజన్ జర్నలిస్టులు కూడా హత్యకు గురయ్యారు. పాత్రికేయులకు భారత్ ఆసియాలోనే అత్యంత ప్రమాదకరమైన దేశంగా పరిణమించింది. 2015లో భారత్‌లో విధి నిర్వహణలో ఉండగా పదిమంది జర్నలిస్టులు హత్యకు గురైతే, మరో నలుగురు అనుమానాస్పద పరిస్థితుల్లో మరణించారు. అదే ఏడాది పాకిస్థాన్‌లో ఇద్దరు, అఫ్ఘానిస్థాన్‌లో ఇద్దరు జర్నలిస్టులు హత్యకు గురయ్యారు. బంగ్లాదేశ్‌లో నలుగురు బ్లాగర్లు హత్యకు గురయ్యారు.



ఇదిలా ఉంటే, మన దేశంలో జర్నలిస్టులపై భౌతిక దాడులు దాదాపు ప్రతి రాష్ట్రంలోనూ జరుగుతూనే ఉన్నాయి. మాఫియా ముఠాలు మాత్రమే కాదు, అధికారంలో ఉన్న రాజకీయ నేతల అనుచర గణాలు కూడా పాత్రికేయులపై యథేచ్ఛగా భౌతిక దాడులకు తెగబడుతున్నాయి. ప్రభుత్వాలు సైతం మీడియాపై సహనం కోల్పోయి, అధికారాన్ని అడ్డు పెట్టుకుని పత్రికా స్వేచ్ఛను కాలరాస్తున్న ఉదంతాలు కొల్లలుగా ఉంటున్నాయి. చివరకు ఎవరికీ కొరుకుడుపడని సోషల్ మీడియాను కట్టడి చేసేందుకు చట్టాలు కూడా తేవాలని ప్రభుత్వాలు ఆలోచిస్తున్నాయంటే, పత్రికాస్వేచ్ఛపై మన పాలకులకు ఎంతటి ప్రేమాభిమానాలున్నాయో అర్థం చేసుకోవచ్చు.

## బాలపాత్రికేయుల 'ఫస్ట్ న్యూస్'

బ్రిటన్‌లోని 'ఫస్ట్ న్యూస్' వారపత్రికను స్థాపించినది పెద్దలే గానీ, ఎడిటర్ మినహా ఇందులోని పాత్రికేయులందరూ చిన్నారులే. బ్రిటన్‌లో చిన్నారి పాత్రికేయులు పనిచేస్తున్న ఏకైక పత్రిక ఇదే. వృత్తిరీత్యా పాత్రికేయులైన సారా థామ్సన్, స్టీవ్ థామ్సన్ దంపతులు పిల్లల కోసం ఒక పత్రికను పిల్లలతోనే నడిపితే బాగుంటుందనే ఆలోచనతో 2006లో 'ఫస్ట్ న్యూస్'ను ప్రారంభించారు. బాల పాత్రికేయులకు దిశానిర్దేశం చేయడానికి సంపాదకురాలిగా తమ స్నేహితురాలైన నిక్కీ కాక్స్‌ను నియమించుకున్నారు. కేవలం పదేళ్ల వ్యవధిలోనే దీని పాఠకుల సంఖ్య 20 లక్షలను అధిగమించారు. బ్రిటన్‌లోని ప్రతి పాఠశాలకూ ఇప్పుడీ పత్రిక క్రమం తప్పకుండా ప్రతివారం చేరుతోంది. కొమ్ములు తిరిగిన జర్నలిస్టులు పనిచేస్తున్న పత్రికలతో పోటీ పడుతూ 'ఫస్ట్ న్యూస్' 2012లో 'బెస్ట్ నేషనల్ వీక్లీ న్యూస్‌పేపర్ ఆఫ్ ది ఇయర్' అవార్డును సాధించిందంటే ఇందులో రిపోర్టర్లుగా పనిచేస్తున్న చిచ్చర పిడుగుల సత్తా ఎలాంటిదో అర్థం చేసుకోవచ్చు.

## బంగ్లాలో బాల పాత్రికేయులు



భారత్ పొరుగునే ఉన్న బంగ్లాదేశ్‌లోనూ కొందరు చిన్నారులు జర్నలిజంలో సత్తా చాటుకుంటున్నారు. ఐక్యరాజ్య సమితి సహకారంతో 'ప్రిజమ్' అనే వీడియో వార్తాసంస్థ కోసం దాదాపు వందమందికి పైగా బాలలు స్వచ్ఛంద పాత్రికేయులుగా పనిచేస్తున్నారు. ప్రధాన పత్రికలు, టీవీ చానెళ్లు పట్టించుకోని అంశాలపై వీరు అద్భుతమైన కథనాలను అందిస్తున్నారు. ఐక్యరాజ్య సమితికి చెందిన బాలల సంక్షేమ సంస్థ యూనిసెఫ్‌తో పాటు బంగ్లాలోని 'బీడీన్యూస్24 డాట్ కామ్' ఆన్‌లైన్ వారాసంస్థ 'ప్రిజమ్'కు సహాయ సహకారాలు అందిస్తున్నాయి. 'ప్రిజమ్'కు చెందిన బాల పాత్రికేయులు రూపొందించిన కథనాలను 'బీడీన్యూస్24 డాట్ కామ్' ప్రముఖంగా ప్రచురిస్తోంది. 'ప్రిజమ్' బాల పాత్రికేయులు జాతీయ కార్యక్రమాలను కవర్ చేయడమే కాదు, జంకుగొంకు లేకుండా మంత్రులు, ప్రజా ప్రతినిధులతో ముఖాముఖి ఇంటర్వ్యూలు కూడా చేస్తుండటం విశేషం.

## తెలుగు రాష్ట్రాల్లో ఇదీ పరిస్థితి...

భారతదేశంలో పత్రికా స్వేచ్ఛ ఎండమావిలో నీరులాంటిదేనని అంతర్జాతీయ నివేదికలు తేటతెల్లం చేస్తున్నాయి. తెలుగు రాష్ట్రాల పరిస్థితి ఇందుకు భిన్నంగా ఏమీ లేదు. పాలక వర్గాలు, పోలీసు బలగాల నుంచి పాత్రికేయులకు ముప్పు ఎదురవుతున్న సందర్భాలు ఉభయ తెలుగు రాష్ట్రాల్లోనూ కొల్లలుగా ఉంటున్నాయి. సహేతుకమైన విమర్శలను, వ్యంగ్యాస్త్రాలను ఏమాత్రం సహించలేని పాలకులు మెయిన్‌స్ట్రీమ్ మీడియా ప్రతినిధులపైనే కాదు, సోషల్ మీడియాలో విమర్శలు సంధిస్తున్న వారిని సైతం కట్టడి చేసేందుకు అధికార బలప్రయోగానికి పాల్పడుతున్నారు. పాలకుల రాజకీయ అసహనానికి ఫేస్‌బుక్‌లో 'పొలిటికల్ పంచ్' పేజీ నిర్వాహకుడు ఇంటూరి రవికిరణ్ అరెస్టు ఒక తాజా ఉదాహరణ. ఇటీవలి కాలంలో తెలుగు రాష్ట్రాల్లోని జర్నలిస్టులపై భౌతిక దాడులు జరిగిన సందర్భాలు చాలానే ఉన్నాయి. తమపై వ్యతిరేక వార్తలు రాస్తున్నారనే అక్కసుతో పాలకొల్లుకు చెందిన దళిత జర్నలిస్టు రవిపై అక్కడి ఎమ్మెల్యే అనుచరులు హత్యాయత్నానికి తెగబడ్డారు. చీరాలలో ఫ్రీలాన్స్ జర్నలిస్టు నాగార్జునరెడ్డిపై సాక్షాత్తు ఎమ్మెల్యే కృష్ణమోహన్ సోదరుడే తన అనుచరగణంతో భౌతికదాడికి పాల్పడ్డారు. హైదరాబాద్‌లోని గాంధీభవన్‌లో వార్తల కవరేజీకి వెళ్లిన ఇద్దరు జర్నలిస్టులపై పోలీసులు దాష్టీకానికి పాల్పడ్డారు. తెలుగు రాష్ట్రాల్లో ఇలాంటి సంఘటనలు చాలానే జరుగుతున్నాయి. పత్రికాస్వేచ్ఛపై పాలకులు చెప్పేదొకటి చేసేదొకటిగా ఈ సంఘటనలే తేటతెల్లం చేస్తున్నాయి. మూడేళ్ల కిందట గుంటూరు జిల్లాలోని చిలకలూరిపేటలో ఆంధ్రప్రభ విలేకరి ఎంవీఎన్ శంకర్ దారుణ హత్యకు

గురయ్యారు. ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా కమిటీ స్వయంగా అక్కడకు చేరుకుని విచారణ చేపట్టడంతో పోలీసులు ముగ్గురు నిందితులను అరెస్టు చేశారు. అరెస్టయిన వారిలో మంత్రి పత్తిపాటి పుల్లారావు అనుచరుడైన రౌడీషీటర్ వెంగళరాయుడు కూడా ఉండటం గమనార్హం. రెండేళ్ల కిందట వినుకొండలో 'క్రైం టుడే ఏపీ' మాసపత్రిక సంపాదకుడు స్టీవెన్‌బాబుపై హత్యాయత్నం జరిగింది. తూర్పుగోదావరి జిల్లా సాగునీటి సంఘాల ఎన్నికల సందర్భంగా కవరేజికి వెళ్లిన 'సాక్షి' విలేకరి పోతుల జోగేష్‌పై టీడీపీ నాయకులు రాళ్లతో దాడిచేశారు. వార్తలు కవర్ చేయనివ్వకుండా కెమెరా లాక్కున్నారు. మట్టితవ్వకాల మాఫియాపై వార్తలు రాశాడనే అక్కసుతో 'ఆంధ్రజ్యోతి' విలేకరి చెరుకూరి లక్ష్మణస్వామి నాయుడుపై టీడీపీ నాయకుడు ఒకరు తన అనుచరులతో కలసి దాడికి పాల్పడ్డాడు. కృష్ణా జిల్లా ముసునూరు మండలంలో తహశీల్దారు వనజాక్షిపై దాడి చేసిన సమయంలోనే అక్కడే ఉన్న 'సాక్షి' విలేకరి కర్రా నవీన్‌కుమార్‌పై కూడా చింతమనేని అనుచరులు దాడికి



చీరాలలో నాగార్జునరెడ్డిపై ఎమ్మెల్యే కృష్ణమోహన్ సోదరుడి దాడి



పాలుకొల్లులో ఎమ్మెల్యే అనుచరుల చేతిలో దాడికి గురైన రవి



పొలిటికల్ పంచ్' ఇంటూరి రవికిరణ్

తెగబడ్డారు. వైఎస్ఆర్ కాంగ్రెస్ తరపున గెలిచి, టీడీపీలో చేరిన విజయవాడ పశ్చిమ నియోజకవర్గ ఎమ్మెల్యే జలీల్‌ఖాన్ సైతం వార్తల కవరేజికి వెళ్లిన సాక్షి ఫొటోగ్రాఫర్, వీడియోగ్రాఫర్లపై దాడి చేయించారు. విశాఖపట్నంలోని గాజువాకలో దుబాయి ఉద్యోగాల పేరిట నిరుద్యోగులకు టోకరా వేసిన ఒక సంస్థ నిర్వాహకులు కవరేజికి వెళ్లిన 'సాక్షి' టీవీ ప్రధాన విలేకరి వి.వెంకట జగన్నాథరావు, కెమెరామెన్ సుధాకర్‌లపై దాడికి తెగబడ్డారు. రాష్ట్రవ్యాప్తంగా తరచు ఇలాంటి సంఘటనలు జరుగుతున్నా ప్రభుత్వం మాత్రం పత్రికా స్వేచ్ఛకు భరోసా కల్పించలేకపోవడం గమనార్హం.

*– సాక్షి ఆంధ్రప్రదేశ్ నెట్‌వర్క్ సహకారంతో...*

# కార్మికులూ... కష్టసుఖాలూ...

‘పోరాడితే పోయేదేముంది బానిస సంకెళ్లు తప్ప’ అనే నినాదంతో ప్రపంచ కార్మికులంతా ఏకమై పోరాడి తమ హక్కులను సాధించుకున్న రోజు ప్రపంచ కార్మికుల దినం. పంతొమ్మిదో శతాబ్దిలో ప్రపంచమంతటా కార్మికులు దారుణంగా శ్రమదోపిడీకి గురయ్యేవారు. పొద్దస్తమానం పనిలో నలిగిపోయేవారు. ఓపిక నశించిన కార్మికులు పెట్టుబడిదారుల అన్యాయాలకు వ్యతిరేకంగా పోరాటం సాగించారు. ఎనిమిది గంటల పనిదినాలను, కనీస వేతనాలను సాధించుకున్నారు. కార్మిక లోకంలో ఇవి తొలి విజయాలు. అప్పటికీ, ఇప్పటికీ రోజులు మారాయి. అభివృద్ధి చెందిన దేశాలలో పరిస్థితులు మెరుగుపడ్డాయి. కార్మికుల కనీస వేతనాలు కళ్లు చెదిరే స్థాయికి చేరుకున్నాయి. అభివృద్ధి చెందుతున్న, వెనుకబడిన దేశాల్లో మాత్రం కార్మికుల స్థితిగతులు పెద్దగా మెరుగుపడలేదు. చాలా దేశాల్లో కనీస వేతన చట్టాలు, పనివేళల నిబంధనలకు సంబంధించిన చట్టాలు ఉన్నా, అవి సజావుగా అమలవుతున్న దాఖలాలు లేకపోవడంతో కార్మికులు ఇప్పటికీ శ్రమదోపిడీకి గురవుతూనే ఉన్నారు. అభివృద్ధి చెందిన దేశాల్లోని కార్మికులు గంటలో సంపాదించే మొత్తాన్ని వెనుకబడిన దేశాల కార్మికులు నెల్లాళ్లు శ్రమిస్తే గానీ కళ్ల చూడలేకపోతున్నారు. కొన్ని దేశాలు కార్మికుల పాలిట స్వర్గధామాల్లా ఉంటే, ఇంకొన్ని దేశాలు వారికి ప్రత్యక్ష నరకాల్లా ఉంటున్నాయి. అలాంటి దేశాల సమాచారం ప్రపంచ కార్మిక దినోత్సవం సందర్భంగా...

## అత్యల్ప కనీస వేతనాల్లో టాప్-10 దేశాలు

| | దేశం | కనీస వేతనం (నెలకు) | |
|---|---|---|---|
| 1. | క్యూబా | 9.00 డాలర్లు | (రూ. 582) |
| 2. | బంగ్లాదేశ్ | 19.00 డాలర్లు | (రూ. 1228) |
| 3. | సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ | 41.00 డాలర్లు | (రూ. 2650) |
| 4. | కిర్గిజిస్తాన్ | 43.00 డాలర్లు | (రూ. 2780) |
| 5. | టాంజానియా | 45.00 డాలర్లు | (రూ. 2909) |
| 6. | గాంబియా | 47.00 డాలర్లు | (రూ. 3038) |
| 7. | మలావి | 48.00 డాలర్లు | (రూ. 3103) |
| 8. | గినీ బిసావు | 49.00 డాలర్లు | (రూ. 3168) |
| 9. | కాంగో | 49.00 డాలర్లు | (రూ. 3168) |
| 10. | లైబీరియా | 50.00 డాలర్లు | (రూ. 3232) |

## అత్యధిక కనీస వేతనాల్లో టాప్-10 దేశాలు

| | దేశం | కనీస వేతనం (గంటకు) | |
|---|---|---|---|
| 1. | నెదర్లాండ్స్ | 12.25 డాలర్లు | (రూ. 792) |
| 2. | లగ్జెంబర్గ్ | 12.20 డాలర్లు | (రూ. 788) |
| 3. | బెల్జియం | 12.00 డాలర్లు | (రూ. 776) |
| 4. | ఫ్రాన్స్ | 11.80 డాలర్లు | (రూ. 763) |
| 5. | ఐర్లాండ్ | 11.78 డాలర్లు | (రూ. 761) |
| 6. | కెనడా | 11.72 డాలర్లు | (రూ. 757) |
| 7. | న్యూజిలాండ్ | 11.49 డాలర్లు | (రూ. 743) |
| 8. | బ్రిటన్ | 10.38 డాలర్లు | (రూ. 671) |
| 9. | సాన్ మారినో | 9.59 డాలర్లు | (రూ. 620) |
| 10. | స్విట్జర్లాండ్ | 9.00 డాలర్లు | (రూ. 582) |

## అవలక్షణవంతుడికి అక్షతలిస్తే...



అజ్ఞానం వల్లో, నిర్లక్ష్యం వల్లో చేయాల్సిన పని సక్రమంగా చేయరు కొందరు.

ఒక పనికి వచ్చి మరో పని చేయడంలో కూడా ఇలాంటి వారు దిట్టలు.

భోజనానికని వెళ్లి తాపీగా కాఫీ తాగివస్తారు.

కాఫీకని వెళ్లి హడావుడిగా భోజనం చేసి వస్తారు.

ఏ పనీ సక్రమంగా చేయక నలుగురిలో నవ్వుల పాలవుతుంటారు.

వెనకటికి ఒక ఆసామి పెళ్లికి వెళ్లాడు. ఈయన చేతికి అక్షింతలు ఇచ్చి వధూవరులను ఆశీర్వదించమన్నారు పెద్దలు. పాపం ఈయనేమో...మాంచి ఆకలి మీద ఉన్నాడు...ఆశీర్వాదం సంగతి ఆ తరువాత అనుకొని బయటికి వెళ్లి అక్షింతలను నోట్లో వేసుకున్నాడు!

ఎవరైనా తిక్క పనులో, తెలివి తక్కువ పనులో చేసినప్పుడు...

'అవలక్షణవంతుడికి అక్షతలిస్తే అవతలికెళ్లి నోట్లో వేసుకున్నాడట' అంటారు.

## అక్కన్న మాదన్నలు



ఇద్దరు అన్నదమ్ములు అన్యోన్యంగా ఉన్నప్పుడుగానీ, ఇద్దరు స్నేహితులు అన్నదమ్ముల్లా కలిసి ఉన్నప్పుడుగానీ అక్కన్న మాదన్నలతో పోల్చుతుంటారు. భక్త రామదాసు చరిత్ర తెలిసిన వారికి అక్కన్న మాదన్నల పేర్లు సుపరిచితమే.

గోల్కొండ తానీషా దగ్గర మంత్రులుగా పని చేసిన అక్కన్న, మాదన్నలు స్వామిభక్త పరాయణులు, సత్యప్రియులు, ధర్మసంస్థాపకులుగా ప్రసిద్ధి పొందారు. వీరి సమగ్ర చరిత్ర ఏదీ అందుబాటులో లేనప్పటికీ... అక్కన్న మాదన్నల అన్యోన్యత గురించి ఎన్నో కథలు ప్రచారంలో ఉన్నాయి. అందుకే ఏ ఇద్దరు అయినా అన్యోన్యంగా ఉంటే అక్కన్న మాదన్నలతో పోల్చుతుంటారు.



## ఉద్యోగం పోగొట్టుకున్నవారిలో పెరిగే పక్షవాతం అవకాశాలు!

ఉద్యోగం పోగొట్టుకోవడం వల్ల కేవలం ఆర్థికమైన నష్టాలే కాదు... ఆరోగ్యపరమైన సమస్యలూ వస్తాయంటున్నారు జపాన్‌కు చెందిన శాస్త్రవేత్తలు. ఒసాకా యూనివర్సిటీస్ గ్రాడ్యుయేట్ స్కూల్ ఆఫ్ మెడిసిన్‌కు చెందిన పబ్లిక్ హెల్త్ విభాగంలో ప్రొఫెసర్ అయిన డాక్టర్ ఎహాబ్ ఎషాక్ ఒక అధ్యయనాన్ని నిర్వహించారు. ఈ అధ్యయన కార్యక్రమంలో భాగంగా దాదాపు 42,000 మంది జపనీయులను ఆయన పరిశీలించారు. సుదీర్ఘంగా పదిహేనేళ్లకు పైగా సాగిన ఈ అధ్యయనంలో ఉద్యోగంలో ఉన్నవారితో పోలిస్తే... ఉద్యోగాన్ని పోగొట్టుకున్నవారిలో పక్షవాతం వచ్చే అవకాశాలు చాలా ఎక్కువ అని తేలిందని పేర్కొంటున్నారు ఎషాక్. అంతేకాదు... ఈ ఫలితాలు మహిళలకూ వర్తిస్తాయనీ, ఉద్యోగం పోగొట్టుకున్నప్పుడు పక్షవాతం వచ్చే అవకాశాలు పురుషులతో పోలిస్తే మహిళల్లో 50 శాతం ఎక్కువని పేర్కొన్నారు.

## యోగాతో చికిత్స తర్వాతి దుష్ప్రభావాలు మాయం!

ప్రోస్టేట్ క్యాన్సర్ చికిత్స పూర్తయిన తర్వాత క్రమం తప్పకుండా యోగా చేస్తే... చికిత్స కారణంగా వచ్చే దుష్ప్రభావాలు గణనీయంగా తగ్గుతాయని ఇటీవల నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. ప్రోస్టేట్ క్యాన్సర్ వచ్చిన వారికి చేసే చికిత్సల్లో రేడియేషన్ కూడా ఒకటి. నాలుగు లేదా ఐదో వారం ఇచ్చే చికిత్స తర్వాత రోగి బాగా నీరసించిపోవడం అన్నది సాధారణంగా జరిగేదే. అయితే యోగా చేస్తున్న గ్రూపును గమనించినప్పుడు ఇలాంటి నీరసం అంతగా కనిపించలేదని పేర్కొంటున్నారు డాక్టర్ నేహా వాపివాలా. ఆమె యూనివర్సిటీ ఆఫ్ పెన్సిల్వేనియాలోని రేడియేషన్ ఆంకాలజీ విభాగంలో అసోసియేట్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారు. ప్రోస్టేట్ క్యాన్సర్‌కు రేడియేషన్ చికిత్స తీసుకునే వారిలో క్రమం తప్పకుండా హాజరై యోగా చేసే 22 మందిని పరిశీలించారు. యోగా క్లాసులకు తప్పనిసరిగా హాజరయ్యే వీరిలో నీరసం, నిస్సత్తువ వంటి లక్షణాలు అంతగా కనిపించేవి కావు. అయితే యోగా క్లాసుకు హాజరుకాని మరో గ్రూపులో 28మంది సభ్యులు మాత్రం తరచూ నీరసం, నిస్సత్తువతో ఉండటాన్ని తన ఆధ్వర్యంలో నిర్వహించిన ఈ అధ్యయనంలో ఆమె గమనించారు. ఈ అధ్యయన ఫలితాలు 'ఇంటర్నేషనల్ జర్నల్ ఆఫ్ రేడియేషన్ ఆంకాలజీ, బయాలజీ అండ్ ఫిజిక్స్'లో ప్రచురితమయ్యాయి.



## హాట్‌ఫ్లషెస్ కనిపిస్తున్నాయా?

మెనోపాజ్ తర్వాత కొందరు మహిళల్లో ఒంట్లోంచి వేడి ఆవిర్లు (హాట్ ఫ్లషెస్) వస్తున్నట్లయితే, అలాంటి వారికి గుండె జబ్బులు వచ్చే అవకాశాలు ఎక్కువని కొత్త పరిశోధనలు వివరిస్తున్నాయి. యూనివర్సిటీ ఆఫ్ పిట్స్‌బర్గ్ స్కూల్ ఆఫ్ మెడిసిన్‌కు చెందిన రెబెకా థరిస్టన్ ఆధ్వర్యంలో 272 మంది మహిళలపై ఒక అధ్యయనాన్ని నిర్వహించారు. తొలుత 40 నుంచి 60 ఏళ్ల వయసు ఉన్నవారిని సమీకరించారు. వాళ్లలోనే 40 నుంచి 53 వయసు ఉన్న వారిని ఒక గ్రూపుగా విభజించారు. వారిపై ఇదే అధ్యయనాన్ని నిర్వహించారు. ఈ తక్కువ వయసు గ్రూపుపై నిర్వహించిన అధ్యయనంలో



రుతుక్రమం ఆగిపోయే సమయానికీ, రక్తనాళాలు బలహీనం కావడానికీ ఏదో సంబంధం ఉన్నట్లు తేలింది. 54 నుంచి 60 ఏళ్ల వారిని ఇంకో గ్రూపుగా విభజించి, వారినీ అధ్యయనం చేశారు. ఈ వయసు వారికి మాత్రం వయసుకూ, రక్తనాళాలు బలహీనం కావడానికి సంబంధం ఏమీ కనిపించలేదు. దాంతో ఈ అధ్యయన ఫలితాలను డాక్టర్ రాబిన్ అనే నిపుణుడు ఇలా విశ్లేషిస్తున్నాడు. ''చిన్న వయసుకే మెనోపాజ్ చేరిన వారిలో హాట్‌ఫ్లషెస్ లక్షణాలు కనిపించిన వారికి గుండెజబ్బులు వచ్చే అవకాశం ఎక్కువ కాగా... పెద్ద వయసు వచ్చాక మెనోపాజ్ వచ్చి హాట్‌ఫ్లషెస్ కనిపించినా వారిలో గుండెజబ్బులకు అంతే అవకాశం ఉండకపోవచ్చు'' అంటారు డాక్టర్ రాబిన్. అయితే పూర్తి అధ్యయనం తర్వాత ఈ రెండు గ్రూపుల వివరాలను సమగ్రంగా పరిశీలిస్తే... కొందరిలో గుండెజబ్బులకూ, అర్లీ మెనోపాజ్‌కు ఏదో సంబంధం ఉన్నట్లే కనిపిస్తోందనీ, దీనిపై మరిన్ని అధ్యయనాలు చేపట్టాల్సి ఉందంటున్నారు మరికొందరు నిపుణులు.

• మే 4 - గివ్ డే

# దైవ దాతలు

ఒక మనిషి... నోరులేని జీవాల కన్నీటి రోదనవుతాడు. తెగిపడిన చెట్టు మౌన వేదనవుతాడు. సాటి మనిషి ఆకలి అరుపులకు ఆహారమవుతాడు. ఆ మనిషి పేరు మంచి. మారుపేరు జాలి. ముద్దు పేరు దయ అలియాస్ కరుణ. ప్రపంచమంతా మోసం, దగా, కుట్ర, పగ, ద్వేషం, స్వార్థం, హింస, అహంకారం, నయవంచన, క్రూరత్వం లాంటి భయానక జబ్బులతో బాధపడుతుంటే.. ఆ మనిషి మాత్రం పాపం అనే మందు రాసి ఓదారుస్తుంటాడు. చిన్నప్పుడు చెల్లి ఏడ్చిందని చాక్లెట్‌ని, స్కూల్‌కెళ్లేప్పుడు తోటి నేస్తం బాధపడ్డాడని పలకా బలపాన్నీ, కాలేజీలో జూనియర్ భయపడుతున్నాడని కొండంత ధైర్యాన్నీ, వ్యాపారంలో తన భాగస్వామి దెబ్బతిన్నాడని ఆర్థిక సాయాన్నీ చేస్తూ... అంచెలంచెలుగా ఎదిగిన ఆ మనిషి అసలు పేరు సహాయం. అతడికి ఇవ్వడం మాత్రమే తెలుసు. 'చిన్నదైనా, పెద్దదైనా.. కష్టమైనా, నష్టమైనా.. తనకు తోచింది, తను ఇవ్వగలిగింది ఏదీ దాచుకోడు. ఇచ్చేస్తాడు.'

**హృదయపు గదుల్లో..**

ఎక్కడ అభాగ్యులు బావురుమంటారో, ఎక్కడ అమాయకులు హాహాకారాలు చేస్తుంటారో... ఎక్కడ బాధితులు గుండెలు బాదుకుని ఏడుస్తుంటారో అక్కడ.... నీడలా, నిలువెత్తు అండలా నిలబడే 'మిస్టర్ సహాయం'.. ప్రతి మనిషికి ఆత్మబంధువే. అయితే హృదయపు గదిలో నేను, నా అనే స్వార్థపు లక్షణాలతో.. పోటీ పడుతూ మొదటి స్థానాన్ని కోరుకుంటాడు. తనకు తగిన స్థానం ఇవ్వకపోతే.. అదే హృదయంలో చీకటి గదికి పరిమితమైపోతాడు.

**గివ్ డే**

ఆర్థికంగా వెనుకబడిన వారికి, దుర్భర పరిస్థితులతో సతమతమవుతున్న వారికి సాయం చేసేందుకు ప్రత్యేకంగా ఓ రోజు ఉంది. ఆ రోజే 'మే-4' వరల్డ్ గివ్ డే. సాయం కోసం ఎదురు చూసే అభాగ్యుల కోసం మే ఫోర్త్ డెడ్ లైన్‌తో.. 'బిగ్ డే ఆఫ్ గివింగ్' అనే ఓ బ్లాగ్ కూడా ఉంది. ఇందులో ప్రతీ ఒక్కరు ఆర్థిక సాయం చెయ్యొచ్చు. ఎలాంటి బాధితులకు మన సాయం చెందాలో కూడా.. ఆప్షన్స్ ద్వారా ఎంచుకోవచ్చు. ఈ బిగ్ డే సంస్థ 2013 నుంచి ఈ కలెక్షన్స్ స్టార్ట్ చేసి.. పలు దేశాల నుంచి డొనేషన్స్ సేకరించి అలాంటివారికి అండగా నిలుస్తుంది.

**ఐకమత్యమే మహా బలం..**

'స్టాలిన్' సినిమాలో వికలాంగుల పరుగు పందెం సీన్ గుర్తుందా..? చిన్నారులంతా పరుగు తీస్తున్న సమయంలో ఓ బాలుడు కాలు జారి కింద పడిపోతాడు. అప్పుడు విజయానికి దగ్గరలో ఉన్న చిన్నారితో సహా అంతా వెనక్కి వచ్చి.. పడిపోయిన తమ స్నేహితుడిని పైకి లేపి.. అంతా భుజాలపై చేతులు వేసుకుని, అడుగులో అడుగులు







వేసుకుంటూ వెళ్లి లక్ష్యాన్ని తాకి అది తమందరి విజయం అని చాటి చెబుతున్న సీన్ చూస్తుంటే రోమాలు నిక్కబొడుస్తాయి. గుండెల్లో దాగి ఉన్న ఏదో ప్రవాహం కెరటంగా ఎగిసిపడుతుంది. 'నేనున్నాను' అనే భరోసా ఎంత గొప్పదో అర్థమవుతుంది. 'ఓ మనిషి నిదురలే..! నీలో దాగిన మానవత్వాన్ని మేల్కొల్పు' అన్నట్లు ఉంటుంది ఆ సన్నివేశం.

**ద్రవించదా.. చలించదా..?**

గుక్కెడు నీళ్ల దొరక్క రోడ్డు పక్కన గుంతల్లో ఉన్న నీరు తాగే అనాథలు ఒక వైపు... నిలువునీడను నాశనం చేసే ఉగ్రపీడిత దేశాల నుంచి పరుగులు తీస్తున్న బాధితులు మరో వైపు.. సహాయం కోసం నిస్సహాయంగా చూస్తుంటే.. హృదయం ఉన్నవారికి ద్రవించక ఏం చేస్తుంది.? చలించక ఏంచేస్తుంది..?

**గాంధీ మాటల్లో..**

'పక్షికింత ధాన్యం.. పశువుకింత గ్రాసం.. మనిషికింత సాయం' అనేది సమాజం ఏనాడో నమ్మిన నైతిక ధర్మం. 'ఒక వస్తువు నీదే అయినా... నీకు దాని వల్ల ఉపయోగం లేనప్పుడు, అది అవసరం అయిన వారికి ఇవ్వకుండా దాచుకోవడం కూడా హింసే' అంటారు గాంధీజీ. 'నాది అనే మమకారాన్ని త్యజించినప్పుడే మానవత్వం పరిమళిస్తుందని' ఆయన ఉద్దేశం కాబోలు. నిజమే, దానికి పరిమితమైన పరిధులు ఏముంటాయి..? జాలి, దయ, కరుణ వంటి స్వచ్ఛమైన లక్షణాలు తప్ప.

**'మంచి' నీడలో..**

'కళ్లతో నవ్వలేని వాడు, మనసుతో ఏడ్వలేని వాడు మనిషే కాదు' పళ్లతో నవ్వడం, కళ్లతో ఏడ్వడమే మనకు తెలుసు. కానీ స్వచ్ఛమైన భావాలను పలికించేటప్పుడు కళ్లు నవ్వుతాయి. హృదయం బరువెక్కే సన్నివేశాలు కంటపడినప్పుడు మనసు గుక్కపెట్టి ఏడుస్తుంది. ఇవి అప్రయత్నంగా సాగే భావాలు. ఏదేమైనా కన్నీళ్లను గుర్తించే మానవత్వం, కష్టాలను గమనించే మంచి మనుషులు ఉన్నంతకాలం ఈ ప్రపంచం చల్లగానే ఉంటుంది. ఏమంటారు?

**- సంహిత నిమ్మన**

# రంగుల లోకాలు

నలుపు తెలుపుల్లో ఏముంటుంది... వెలుగు నీడల సయ్యాట తప్ప! అలవాటైన లేత ముదురు బూడిద రంగులు, పాలిపోయిన పసుపు, వెలిసిపోయిన మట్టి రంగుల్లో ఏముంటుంది... కొడిగట్టిన జీవకళ తప్ప! కొత్తగా వెల్లవేస్తే ఎంత చిన్న పెంకుటిల్లయినా ధవళకాంతులతో ధగధగలాడిపోదూ! అదే ఇంటికి మిరుమిట్లు గొలిపే రంగులు అద్దితే ఇంట్లో ఇంద్రచాపమే విరిసినట్లుగా ఉండదూ! రంగులద్దితే ఇల్లే కాదు, ఏ కట్టడమైనా రంగుల హరివిల్లే అవుతుంది. రంగులతో మిరుమిట్లు గొలుపుతూ కనువిందు చేసే ప్రదేశాలు ప్రపంచంలో అరుదుగా ఉన్నాయి. అలాంటి అరుదైన రంగుల లోకాలు కొన్నింటిని గురించి...

## న్యూవుక్, గ్రీన్‌లాండ్

గ్రీన్‌లాండ్ రాజధాని న్యూవుక్. పేరుకు రాజధాని నగరమే గానీ, జనాభా పద్దెనిమిది వేల లోపే. చల్లని ప్రశాంత వాతావరణం ఆహ్లాదభరితంగా ఉంటుంది. లాబ్రడార్ సముద్ర తీరంలో వెలసిన ఈ న్యూవుక్, గ్రీన్‌లాండ్ నగరంలో అద్భుతమైన ప్రకృతి సౌందర్యమే కాదు, మానవ నిర్మిత భవనాల నిర్మాణ నైపుణ్యం, కొట్టొచ్చిన రంగుల్లో దూరం నుంచి ఆకట్టుకునే వాటి అందచందాలు పర్యాటకులను ఇట్టే ఆకట్టుకుంటాయి.



## బోకాప్: కేప్‌టౌన్, దక్షిణాఫ్రికా

దక్షిణాఫ్రికా రాజధాని కేప్‌టౌన్‌లో అత్యంత ఆకర్షణీయమైన ప్రాంతం బోకాప్. ఇదివరకు దీనిని మలయ్ క్వార్టర్ అనేవారు. కేప్‌టౌన్ నగరానికి నడిబొడ్డున సిగ్నల్ హిల్ కొండవాలు మీద ఏర్పడిన పురాతనమైన టౌన్‌షిప్ ఇది. రెండున్నర శతాబ్దాల కిందటి బోకాప్ మ్యూజియం ఈ ప్రాంత గత వైభవానికి చారిత్రక నిదర్శనంగా ఇప్పటికీ నిలిచి ఉంది. ఇక్కడ వెలసిన ఇళ్లూ, వాణిజ్య భవనాలు రంగు రంగులతో కనువిందు చేయడం ప్రత్యేక ఆకర్షణ.



## లా బోకా, అర్జెంటీనా

అర్జెంటీనా రాజధాని బ్యూనోస్ ఏరీస్ నగరానికి శివారు పట్టణం లా బోకా. ఇటలీలోని జెనోవా నగరం నుంచి చాలా ఏళ్ల కిందట వలస వచ్చి ఇక్కడ స్థిరపడిన వారితో ఏర్పడింది ఈ పట్టణం. ఇటాలియన్ శైలిలో నిర్మించిన ఇక్కడి ఇళ్లన్నీ కొట్టొచ్చినట్లు కనిపించే రంగులతో చూపరులను ఆకర్షిస్తాయి. అర్జెంటీనా వచ్చే పర్యాటకులు రంగుల లోకంలా కనువిందు చేసే ఈ ప్రాంతాన్ని సందర్శించడానికి ఉబలాటపడతారు.

## సాగ్వారో హోటల్, కాలిఫోర్నియా

కాలిఫోర్నియాలోని సాగ్వారో పామ్ స్ప్రింగ్స్ హోటల్ ప్రపంచంలోనే అత్యంత వర్ణభరితమైన హోటల్. మొదట్లో ఇది సాదాసీదాగానే ఉండేది. హోటల్ యాజమాన్యం దీని రూపురేఖలను మార్చి మరింత ఆకర్షణీయంగా తీర్చిదిద్దాలనుకుని, 2012లో ఆ బాధ్యతను న్యూయార్క్‌కు చెందిన స్టాంబర్గ్ అఫెరియాట్ ఆర్కిటెక్చర్ సంస్థకు అప్పగించింది. 'స్టాంబర్గ్' ఆర్కిటెక్ట్‌ల కళాదృష్టి ఫలితంగా ఇది రంగుల లోకంగా రూపొందింది.



## అల్కాఫ్ వంతెన: సింగపూర్

దూరం నుంచి చూస్తే పొడవాటి పడవలా కనిపించే ఈ రంగుల వంతెన సింగపూర్‌లో ఉంది. సింగపూర్‌లోని రాబర్ట్‌సన్ క్వే ప్రాంతంలో సింగపూర్ నదిపై ఇరవయ్యేళ్ల కిందట 55 మీటర్ల పొడవున నిర్మించిన ఈ పాదచారుల వంతెన ప్రత్యేక ఆకర్షణగా నిలుస్తోంది. మొదట్లో ఈ వంతెన మిగిలిన అన్ని వంతెనల్లాగానే ఉండేది. దీనిని కొంచెం ఆకర్షణీయంగా మార్చాలనుకుంది సింగపూర్ అర్బన్ రీడెవలప్‌మెంట్ అథారిటీ. అనుకున్నదే తడవుగా 2004లో ఈ వంతెనకు రంగులద్ది చూపరులకు ఆహ్లాదభరితంగా తీర్చిదిద్దింది.



## నైహాన్ స్ట్రీట్, డెన్మార్క్

డెన్మార్క్ రాజధాని కోపెన్‌హాగన్‌లోని పురాతన ప్రాంతం ఇది. సముద్రానికి అనుసంధానిస్తూ నిర్మించిన కాలువపై పదిహేడో శతాబ్దిలో ఏర్పాటు చేసిన నౌకాశ్రయం ఒడ్డున వెలసిన టౌన్‌షిప్ ఇది. డానిష్ భాషలో 'నైహాన్' అంటే కొత్త నౌకాశ్రయం అని అర్థం. రెస్టారెంట్లు, బార్లు, షాపింగ్ మాల్స్‌తో కళకళలాడే ఈ ప్రాంతంలోని కట్టడాలన్నీ కొట్టొచ్చే రంగులతో కనువిందు చేస్తాయి. డెన్మార్క్ వచ్చే పర్యాటకులు చూసి తీరాల్సిన ప్రదేశం ఇది.

## పోజ్నాన్, పోలండ్

పోలండ్‌లోని వార్తా నది ఒడ్డున వెలసిన చారిత్రక నగరం పోజ్నాన్. పోలండ్‌లో ఇది ఇప్పటికీ సాంస్కృతిక, వాణిజ్య కేంద్రంగా వర్ధిల్లుతోంది. ఇక్కడి పురాతన కట్టడాలే కాదు, అధునాతన భవంతులు కూడా మిరుమిట్లు గొలిపే రంగులతో చూపరులను కట్టిపడేసేలా ఉంటాయి. పోజ్నాన్ నడిబొడ్డున ఉన్న స్టారీ రైనెక్‌లో అడుగు పెడితే రంగు రంగుల వింతలోకంలో విహరిస్తున్నట్లే ఉంటుంది.



# మంజునాథుడు కొలువుదీరిన ధర్మస్థల



అన్ని విశ్వాసాలకూ, మతాలకూ చెందిన భక్తులు ఈ ఆలయాన్ని సందర్శిస్తారు. ఇక్కడి దేవతలను దర్శించుకుంటారు. మొక్కులు తీర్చుకుంటారు. ఈ ఆలయంలో నిత్యం పదివేలమందికి అన్నదానం, ఆధునిక వైద్య విజ్ఞాన శాస్త్రానికి సైతం అంతుపట్టని పలు వ్యాధులకు ఔషధ దానాలతోపాటు వేలూ, లక్షలూ వెచ్చించి చదువు కొనలేని పేద విద్యార్థులకు సలక్షణమైన, నాణ్యమైన విద్యాదానమూ జరుగుతుంది. అంతేకాదు, ప్రకృతి వైపరీత్యాలు సంభవించినప్పుడు అభాగ్యులు తల దాచుకునేందుకు వీలుగా ఇక్కడ ఆశ్రయమూ లభిస్తుంది. ఈ సరికి అర్థమయ్యే ఉంటుంది ఆ క్షేత్రం ఏమిటనేది. అదే ధర్మస్థల.

బెంగళూరు నుంచి సుమారు డెబ్బై కిలోమీటర్ల దూరంలో గల ధర్మస్థల కర్ణాటక రాష్ట్రంలోని అత్యంత ప్రసిద్ధి చెందిన పుణ్యక్షేత్రాలలో ఒకటి. భక్తులందరూ ఈ ఆలయాన్ని ఒక్కసారైనా సందర్శించి, ధర్మదేవతలను దర్శించుకుని, మంజునాథుని సేవించుకోవాలని ఉవ్విళ్లూరుతుంటారు.

**స్థలపురాణం:** పూర్వం కుడుమ అనే పట్టణం ఉండేది. ఆ పట్టణంలో జైన సైనికాధికారి బిర్మన్న, ఆయన భార్య అంబుమల్లాతి ఉండే వారు. నిరాడంబరంగా, నిజాయితీగా ఉంటూ, సాటివారికి సాయం చేసే ఈ దంపతులను అందరూ గౌరవించే వారు. ధర్మపరాయణులుగా, ఆపదలలో ఉన్న వారిని ఆదుకునేవారిగా వారి కీర్తి దేవతల వరకు చేరింది. దాంతో ఇద్దరు ధర్మదేవతలు ఒక రాత్రిపూట వాళ్ల ఇంటికి నిరుపేద వృద్ధదంపతుల రూపంలో వచ్చారు. హెగ్గడే దంపతులు వారిని సాదరంగా ఆహ్వానించి, అతిథి సత్కారాలు చేశారు. ధర్మదేవతలు వారితో తమకు ఆ ఇల్లు ఎంతో నచ్చిందని, ఇల్లు ఖాళీచేసి తమకు ఇవ్వమని అడిగారు. వారు క్షణం కూడా ఆలస్యం చేయకుండా ముక్కూముఖం తెలియని వారి కోసం ఆ ఇంటిని ఖాళీ చేసి ఇచ్చేందుకు సిద్ధపడ్డారు. వారి ఔదార్యానికి సంతోషించిన ధర్మదేవతలు నిజ రూపంలో వారికి సాక్షాత్కరించారు. హెగ్గడే దంపతులు ఎంతో సంతోషంతో వారికి ఆ ఇంటిని అప్పగించి, వారికి పూజలు చేశారు. ఆ ఇంటిని అందరూ నెలియాడిబీడు అని పిలవసాగారు.

కాలక్రమేణా ఆ ఇల్లు కాస్తా ఆలయంగా రూపుదిద్దుకుంది. అక్కడి ఆలయ పూజారికి ఒకరోజున పూనకం వచ్చి, ఆ దేవతల సన్నిధిలో శివలింగాన్ని ప్రతిష్ఠించి, పూజించవలసిందిగా గ్రామప్రజలను ఆదేశించాడు. దాంతో హెగ్గడే దంపతుల వంశీకుడైన అణ్ణప్ప హెగ్గడే అనే అతను మంగుళూరు పక్కనున్న కద్రి నుంచి శివలింగాన్ని తీసుకు వచ్చి ధర్మదేవతల సన్నిధి పక్కనే ప్రతిష్ఠించాడు. ఆ లింగమే మంజునాథుడుగా పూజలందుకుంటోంది. అనంతరం ఓ వైష్ణవుడు తన ఆస్తిపాస్తులన్నింటినీ అమ్ముకుని ఆలయానికి అంగరంగవైభవంగా కుంభాభిషేకం జరిపించాడు. అప్పటి నుంచి ఈ పుణ్యస్థలాన్ని అందరూ ధర్మస్థల అని పిలవసాగారు.

**ఆలయ వర్ణన:** చెక్కస్తంభాలతో నిర్మితమైన ఈ ఆలయం అందమైన కళాకృతులతో శోభిల్లుతుంటుంది. ఆలయాన్ని చేరుకోగానే విశాలమైన ముఖద్వారం భక్తులకు స్వాగతం పలుకుతుంటుంది. ఆలయ ప్రాంగణంలో ఒక సన్నిధిలో మంజునాథుడు, మరో సన్నిధిలో నరసింహస్వామి దర్శనమిస్తారు. మరో సన్నిధిలో పార్వతీ దేవి, ధర్మదేవతలు కొలువై ఉంటారు. ధర్మస్థల క్షేత్రానికి వెళ్లిన భక్తులు ముందుగా ఇక్కడకు సుమారు ఒకటిన్నర కిలోమీటర్ల దూరంలోని నేత్రావతి నదిలో స్నానమాచరించి, మంజునాథుని, అమ్మవారిని, నలుగురు ధర్మదేవతలను, గణపతిని, అణ్ణప్పదేవుని సందర్శించుకుని, ఆలయంలో ఇచ్చే తీర్థప్రసాదాలను స్వీకరించడం ఆనవాయితీ. అనంతరం ఆలయానికి బయట గల పురాతన రథాలను, వాహన ప్రదర్శన శాలను పుష్పవాటికను, వసంత మహల్‌ను సందర్శించుకుంటారు. మతసామరస్యానికి ప్రతీకగా నిలిచే ఈ ఆలయంలో జరిగే నిత్యాన్నదానంలో అన్ని కులాలు, మతాలవారూ తృప్తిగా భోజనం చేయవచ్చు. అవసరం అయితే ఆశ్రయం పొందవచ్చు. గోమతేశ్వరుడు కొలువుదీరిన శ్రావణ బెళగొళ ఇక్కడికి సమీపంలోనే ఉంటుంది.

**- డి.వి.ఆర్. భాస్కర్**

**ఎలా చేరాలంటే..?**

బెంగళూరు నుంచి ధర్మస్థలకు చేరుకోవడం సులువు. దేశంలోని అన్ని ప్రధాన నగరాలనుంచి ధర్మస్థలకు నేరుగా బస్సులున్నాయి. మంగుళూరు వరకు రైలులో వెళితే అక్కడినుంచి బస్సులో లేదా ప్రైవేటు వాహనాలలో ధర్మస్థలకు వెళ్లవచ్చు. మంగుళూరు విమానాశ్రయం నుంచి కూడా నేరుగా ధర్మస్థలకు బస్సులున్నాయి.

• న్యూ ఫేస్

# మెంతి పొడి మెరుపు

ఉక్కపోతలకు చర్మం కాంతిహీనంగా తయారయిపోతుందని, మొటిమలు, మచ్చలతో... ఉన్న కాస్త మెరుపు, ఛాయ తగ్గిపోతుందని అల్లాడుతున్నారా..? ఉపశమనం కోసం మార్కెట్‌లో దొరికే క్రీమ్స్ కొని, మూడు పూటలా పూస్తున్నారా? జర జాగ్రత్త. అవన్నీ తాత్కాలిక పరిష్కారం మాత్రమే. శాశ్వత పరిష్కారం కావాలంటే సహజసిద్ధమైన ఫేస్ ప్యాక్‌లు వేసుకోవాల్సిందే. మరి ప్రతి వారంలానే ఈ వారం కూడా సరికొత్త ఫేస్ ప్యాక్ విధానం మీకోసం. ట్రై చెయ్యండి.



**కావల్సినవి**

మెంతులు – 2 టేబుల్ స్పూన్స్
కలబంద గుజ్జు – 3 టేబుల్ స్పూన్స్
అరటిపండు గుజ్జు – 1 టేబుల్ స్పూన్

**తయారీ**

ముందుగా 5 లేదా 10 నిమిషాలు మెంతులను నానబెట్టాలి. తరువాత కలబంద, అరటిని గుజ్జు చేసుకుని పక్కన పెట్టుకోవాలి. ఇప్పుడు మెంతులను మిక్సీ చేసుకుని అందులో కలబంద, అరటి గుజ్జులను కలిపి మరో సారి మిక్సీ చేసుకోవాలి. తరువాత ముఖం చల్లని నీళ్లతో కడుక్కుని, ఆ మిశ్రమాన్ని ముఖానికి అప్లై చేసి ఓ 20 నిమిషాలు ఉంచుకోవాలి. తరువాత గోరువెచ్చని నీళ్లతో శుభ్రం చేసుకుని మెత్తటి క్లాత్‌తో తుడుచుకోవాలి. ఈ విధంగా వారానికి రెండు మూడు సార్లు చేస్తే చర్మం కాంతివంతంగా మెరిసిపోతుంది.

• నెయిల్‌ఆర్ట్



# కొమ్మా కొమ్మా.. చూశావమ్మా..? సింబల్ పూసింది!

**నెయిల్ పాలిష్ అంటే మంచిగా పొడవాటి గోళ్లు ఉన్నవాళ్లకే సూటవుతుంది అనుకుంటే పొరబాటే. మోడల్స్ వచ్చుండాలే కానీ... పొడవాటి గోళ్లు లేకపోయినా అదిరే నెయిల్ ఆర్ట్ వేసుకోవచ్చు. వేసుకున్న డ్రెస్‌కు తగ్గట్టుగా మెలికలు, మెరుపులు అన్నీ సంతరించుకోవచ్చు. ఇక్కడ చూడండి. ఈ పిక్‌లోని నెయిల్ ఆర్ట్ చూడ్డానికి ఎంత సూపర్‌గా ఉందో...! మరి ఇంకెందుకు ఆలస్యం ట్రై చెయ్యండి. ఒకవేళ పొడవాటి గోళ్లు ఉన్నవాళ్లు కూడా ఈ ఆర్ట్‌ను వేసుకోవాలనిపిస్తే... కాస్త సైజ్ పెద్దగా వేసుకుంటే సరి.**




1. ముందుగా గోళ్లను శుభ్రం చేసుకుని షేప్ చేసుకోవాలి. తరువాత మీకు ఇష్టమైన ఒక గోరుకి మొత్తం వైట్ కలర్ అప్లై చేసుకోవాలి.
2. తరువాత సన్నని కుచ్చు తీసుకుని బ్లాక్ కలర్‌తో గోరు మధ్యలో ముందు భాగం నుంచి చిన్న చిన్న చుక్కలు పెట్టుకోవాలి. (పిక్‌లో కనిపిస్తున్నట్లు గోరు మొదలులో కొంచెం స్పేస్ ఉంచాలి)
3. ఇప్పుడు ఆ చుక్కల పై నుంచి కుడి వైపుకు, ఎడమ వైపుకు చిత్రంలో చూపిస్తున్నట్లుగా రెండు కొమ్మలు వేసుకోవాలి.
4. తరువాత కుడి వైపు కొమ్మకు కాస్త కిందన మీకు నచ్చిన కలర్‌తో రెండు చిన్న చిన్న చుక్కలు పెట్టుకోవాలి.
5. ఇప్పుడు అదే కలర్‌తో ముందు చుక్కను ఎడమ వైపు కిందికి, బ్లాక్ కలర్ చుక్క దగ్గరకు డ్రా చేసుకోవాలి.
6. తరువాత అదే కలర్‌తో మరో చుక్కను కూడా ఎడమ వైపు పైకి డ్రా చేస్తూ అటాచ్ చేసి సింబల్ ఆకారంలో చేసుకోవాలి
7. ఇప్పుడు కుడివైపు ఉన్న సింబల్‌కు ఆపోజిట్‌గా ఎడమ వైపు కూడా మరో సింబల్ డ్రా చేసుకోవాలి. తరువాత మిగిలిన నెయిల్స్ అన్నింటికీ స్కై బ్లూ లేదా మీకు నచ్చిన కలర్ అప్లై చేసుకుంటే సరిపోతుంది.

● కొత్తకొత్తగా




# కుక్ కంటే కుక్కరే బెటర్

వంట పనికి కుక్ ఉన్నా.. 'మనకు కావాల్సిన రుచులు కావాలంటే స్వయంపాకాలే సరైన పద్ధతి' అనేది చాలా మంది అభిప్రాయం. అందుకే సెలవు రోజు వచ్చిందంటే కిచెన్ గదికే పరిమితమయ్యే వంట ప్రేమికులకు ఈ మిషన్ బాగా ఉపయోగపడుతుంది. ఒక్క సెలవు రోజునే కాదు.. అన్ని రోజులు మీ చేత వంట చేయిస్తుంది. అది కూడా నిమిషాల్లోనే. ఈ పిక్‌లోని కుక్కర్ చూడండి. ఒక్క టచ్ చాలు నిమిషాల్లో మీకు నచ్చే రైసులు, ఫ్రైలు వండి పెట్టేస్తుంది. ఈ కుక్కర్‌లో బ్రౌన్ రైస్, వైట్ రైస్, ఓట్మీల్, కినోవా సలాడ్, గ్రీట్స్, డ్రై అండ్ ఫ్రై, రొయ్యలు, చేపలు, పీతల పులుసులు, సూప్స్, మంచూరియా, కేక్స్, ఆమ్లెట్స్, పిజ్జాలు ఇలా చాలానే తయారు చేసుకోవచ్చు. అది కూడా ఈ కుక్కర్ కింద ఉన్న ఒక చిన్న బటన్‌ను నొక్కితే చాలు. మీకు కావాల్సిన విధంగా రుచికరంగా వండుతోంది. ఈ కుక్కర్‌ను క్యారీ చెయ్యడం, క్లీన్ చెయ్యడం కూడా చాలా ఈజీ.

# 1.. 2.. 3...
# ఈ మెషిన్ వాడిచూడు...

ఈ రోజుల్లో మెషిన్ కొంటే కనీసం రెండు మూడు అవసరాలైనా తీరాల్సిందే అంటున్నారు వినియోగదారులు. అందుకే కస్టమర్ల కోరిక మేరకు కొత్తకొత్త మోడల్స్‌తో పోటెత్తుతున్నాయి కంపెనీలు. ఈ మెషిన్ చూడండి. ఇందులో కాఫీ పెట్టుకోవచ్చు. పెనంపై ఆమ్లెట్లు, రొట్టెలు వేసుకోవచ్చు. మైక్రోవేవ్ ఓవెన్‌లో స్నాక్స్ చేసుకోవచ్చు. ఈ మెషిన్‌లో కుడివైపు కనిపిస్తున్న గాజు మగ్గు కాఫీ మేకర్. దాని పైన ఉన్న మగ్గులో కాఫీకి కావాల్సిన పదార్థాలు వేసుకుంటే కింద మగ్గులోకి వచ్చి చేరుతుంది. ఇక పైన ఉన్న పాన్‌ను, దాని కింద ఉన్న మైక్రోవేవ్ ఓవెన్‌ను ఉపయోగించుకుని మనకు నచ్చిన ఐటమ్స్ చేసుకోవచ్చు. దీన్ని చూస్తుంటే అందరివాడు సినిమాలో 'ఒకటి.. రెండు.. మూడు..' సాంగ్‌ని పేరడీ చెయ్యాలనిపిస్తుంది కదూ..!




# ప్రతిరోజూ... ప్రియమైన ఫ్లేవర్

వేసవి వచ్చిందంటే చల్లని కూలర్, చల్లని ఏసీ, చల్లని పానీ అంటూ అంతా కూలింగ్ జపం చేస్తుంటాం. వడగాలులకు తాళలేక ఉక్కిరి బిక్కిరౌతుంటాం. ఈ సమయంలో టింగ్.. టింగ్.. టింగ్.. అనే ఐస్ క్రీమ్ బెల్ వినిపించగానే ఉరుకులు పరుగులు తీస్తాం. ఇక ఆ కష్టాలు అవసరం లేదు. ఒకే సారి రెండు ఫ్లేవర్స్‌లో ఐస్ క్రీమ్‌ను తయారు చేసే ఈ మెషిన్ మీ ఇంట్లో ఉంటే... ఎప్పుడు కావాలిస్తే అప్పుడు.. ఎన్ని కావాలిస్తే అన్ని.. ఐస్ క్రీమ్స్ చేసుకుని లాగించెయ్యొచ్చు. పాలు, పానీయాల్లో ఐస్ క్రీమ్ ఫ్లేవర్స్, డ్రై ఫ్రూట్స్ యాడ్ చేసుకుని/ఇష్టమైన పండ్లను జ్యూస్ చేసుకుని ఈ మెషిన్‌లో కనిపిస్తున్న కప్స్‌లోకి వేసుకుని స్విచ్ ఆన్ చేస్తే చాలు నోరూరించే ఐస్‌క్రీమ్ మీ సొంతమవుతుంది. ఈ కప్స్‌లోకి ద్రవపదార్థాలు వేసుకోవడానికి రెండు గ్లాస్ తొట్టెలు కూడా ఉంటాయి. ఈ మెషిన్‌లోని మగ్స్, బ్లేడ్స్ అన్నీ అత్యంత ఆధునిక టెక్నాలజీతో రూపొందించినవే. దీని పైభాగం ఓపెన్ చేయడం, తిరిగి అమర్చుకోవడం, వాష్ చేసుకోవడం కూడా చాలా ఈజీ.






● స్నాక్ సెంటర్

## పాలకూర మఫిన్స్

**కావల్సినవి:** మైదాపిండి – 2 కప్పులు
బేకింగ్ పౌడర్ – 2 టేబుల్ స్పూన్స్
పాలకూర తురుము – 1 కప్పు
టమోటా–1 (చిన్నచిన్న ముక్కలుగా తరగాలి)
కొత్తిమీర–2 రెమ్మలు, పాలు–1 కప్పు, వెన్న–అర కప్పు
గుడ్డు–2, ఆయిల్–సరిపడా

**తయారీ:** ముందుగా మైదాపిండి, బేకింగ్ పౌడర్, పాలకూర, కొత్తిమీర తురుము, టమాటా ముక్కలు అన్ని ఒక బౌల్‌లో వేసుకోవాలి. తరువాత మరో బౌల్ తీసుకుని గుడ్లు, పాలు, వెన్న పోసుకుని బాగా కలుపుకోవాలి. ఇప్పుడు పాలకూర మిశ్రమంలో పాలు మిశ్రమాన్ని బాగా కలిపి ముద్దలా చేసుకోవాలి. తరువాత మినీ బౌల్స్ పాన్‌లో ప్రతీ బౌల్‌కు ఆయిల్ రాసి అందులో ఈ మిశ్రమాన్ని పెట్టుకుని ఓ 20 నిమిషాలు ఉడికించుకుంటే సరిపోతుంది.

## సుజీ కచోడీ



**కావల్సినవి:** వాటర్ – 1 కప్పు, బొంబాయి రవ్వ – అర కప్పు, వాము పొడి–1 టేబుల్ స్పూన్, బంగాళదుంప–2 (ఉడికించి ముద్దలా చేసుకోవాలి), పచ్చిమిర్చి–2 (చిన్నముక్కలుగా తరిగినవి), చాట్ మసాలా–అర టేబుల్ స్పూన్, ఆయిల్–డీప్ ఫ్రైకి తగినంత
ఉప్పు–తగినంత

**తయారీ:** ముందుగా బంగాళదుంపలను ఉడికించి, ముద్దలా చేసుకుని పక్కన పెట్టుకోవాలి. తరువాత గ్యాస్ మంటను మీడియంలో ఉంచుకుని పాన్‌లో వాటర్ పోసుకోవాలి. తరువాత అందులో బొంబాయి రవ్వ, వాము పొడి, ఉప్పుతో పాటు ఒక టేబుల్ స్పూన్ ఆయిల్ కూడా వేసుకుని దగ్గరకు అయ్యేదాకా ఉడికించుకోవాలి. తరువాత ఆ మిశ్రమాన్ని ఓ బౌల్‌లోకి తీసుకుని పక్కన పెట్టుకోవాలి. ఇప్పుడు బంగాళదుంపల ముద్దలో పచ్చిమిర్చి ముక్కలు, మసాలా, తగిన ఉప్పు కలిపి మెత్తగా చేసుకోవాలి. తరువాత చేతులకు కొద్దిగా ఆయిల్‌ని రాసుకుని, బంగాళదుంప మిశ్రమాన్ని కొంచెం తీసుకుని చేత్తో నొక్కుకుని అందులో రవ్వ మిశ్రమాన్ని కొద్దిగా ఉంచుకుని మొత్తం బంగాళమిశ్రమంతో కప్పేసుకోవాలి. తరువాత దాన్ని చేత్తో వడల్లా నొక్కుకోవాలి. ఇలా అన్నీ తయారు చేసుకుని ఆయిల్‌లో డీప్ ఫ్రై చేసుకోవాలి.

## పైనాపిల్ టార్ట్స్

**కావల్సినవి:** పైనాపిల్ – 1 (ముక్కలు చేసుకుని నీళ్లు కలపకుండా జ్యూస్‌లా చేసుకోవాలి), షుగర్ – 1 కప్పు, యాలుకల పొడి – కొద్దిగా, గోధుమ పిండి – 200గ్రా., ఛీజ్–100 గ్రా., వాటర్–2 టేబుల్ స్పూన్స్
గుడ్డు–1, ఉప్పు – తగినంత

**తయారీ:** ఒక పాన్ తీసుకుని అందులో పైనాపిల్ జ్యూస్, షుగర్, యాలకల పొడి వేసుకుని గరెటతో కలుపుతూ ముద్దలా అయ్యేంత వరకూ ఉడకనివ్వాలి. ఇప్పుడు ఒక బౌల్ తీసుకుని అందులో గోధుమ పిండి, ఛీజ్, గుడ్డు, నీరు, ఉప్పు వేసుకుని బాగా కలుపుకుని చపాతి ముద్దలా చేసుకోవాలి. తరువాత ఆ ముద్దను చపాతి కర్రతో కాస్త దళసరిగా ఉండేలా చేసుకుని బిస్కెట్ స్క్వేర్ రింగ్ యూజ్ చేసి బిస్కెట్స్ ఆకారంతో కట్ చేసుకోవాలి. ముందుగా తయారు చేసుకున్న పైనాపిల్ మిశ్రమాన్ని చిన్న చిన్న ఉండలుగా చేసుకుని బిస్కెట్ ఫొటోలో చూపిన విధంగా పెట్టుకోవాలి. కొంచెం పిండి మిగిలినట్లైతే దానితో పైనాపిల్ టార్ట్స్‌పై మీకు నచ్చినట్లు డెకరేట్ చేసుకోవచ్చు. చివరిగా వీటిని 25 నిమిషాలు పాటు మైక్రోవేవ్ ఓవెన్‌లో ఉడికించుకుంటే సరిపోతుంది.





# పోనీ బ్రైడ్



ఎంత మంచి డ్రెస్ అయినా వేసుకున్న జడను బట్టి లుక్ మారిపోతుంది. సాదా సీదాగా అల్లుకున్న జడ కంటే కాస్త కొత్తగా.. మోడల్‌గా ఉంటే చూపరుల నోట 'సో బ్యూటీ ఫుల్' అనే మాట అప్రయత్నంగా వచ్చేస్తుంది. ఈ మోడల్ చూడండి. చూడ్డానికి సూపర్‌గా ఉన్న ఈ పోనీ బ్రైడ్ వేసుకోవడం కూడా చాలా ఈజీ. ట్రై చెయ్యండి.

1 ముందుగా హెయిర్ మొత్తం చిక్కులు లేకుండా దువ్వుకుని, కుడివైపు పాపిడ తీసుకోవాలి.

2 తరువాత కుడివైపు, చెవి పక్కన ఉన్న హెయిర్‌లోంచి ఒక పాయను చేతిలోకి తీసుకోవాలి.

3 ఇప్పుడు ఆ పాయకు చిన్న హెయిర్ బ్యాండ్ పెట్టుకోవాలి.

4 తరువాత ఆ పాయ(పోనీ టెయిల్)ను మిగిలిన హెయిర్‌తో కలవకుండా ఉండేందుకు పైకి మడతపెట్టి ఒక క్లిప్ పెట్టుకోవాలి. (క్లిప్ కేవలం తాత్కాలికంగా మాత్రమే).

5 ఇప్పుడు కుడివైపు వెనుక నుంచి కాస్త ఎక్కువ హెయిర్‌ను ఒక పాయలా తీసుకోవాలి.

6 తరువాత ఆ పాయను కదలకుండా పట్టుకుని హెయిర్ బ్యాండ్ పెట్టుకోవాలి.

7 ఇప్పుడు ముందు పోనీ టెయిల్‌కి పెట్టిన క్లిప్ తీసి.. దాన్ని రెండు పాయలుగా చేసుకోవాలి.

8 తరువాత ఆ రెండు పాయల మధ్య 'రెండవ పోనీ టెయిల్'ని ఉంచుకుని.. దాన్ని పైకి లేపి ఈ రెండు పాయలను కలిపి పట్టుకోవాలి.

9 ఇప్పుడు పైకి లేపిన పాయను కదలకుండా క్లిప్ పెట్టుకుని, దానికి చుట్టిన రెండు పాయలను టైట్‌గా పట్టుకోవాలి.

10 ఇప్పుడు కలిపి పట్టుకున్న రెండు పాయలకు తోడుగా ఇంకాస్త హెయిర్‌ను యాడ్ చేసుకోవాలి.

11 తరువాత ఆ హెయిర్ మొత్తాన్ని ఒక పాయలా చేసుకుని పోనీ టెయిల్‌లా హెయిర్ బ్యాండ్ పెట్టుకోవాలి.

12 ఇప్పుడు ఇంతకు ముందు క్లిప్ పెట్టుకున్న పాయను క్లిప్ తీసి వదులుకోవాలి.

13 తరువాత అల్లుకున్న పాయలు అన్నింటినీ కాస్త లూజ్ చేసుకోవాలి.

14 ఇప్పుడు మళ్లీ ఇంతకు ముందులానే బ్యాండ్ పెట్టుకున్న పాయను మధ్యలో పెట్టుకుని... క్లిప్ తీసేసిన పాయను రెండు పాయలుగా చేసుకుని అడుగు నుంచి కలిపి పట్టుకుని మరింత హెయిర్ యాడ్ చేసుకుని బ్యాండ్ పెట్టుకుంటూ మొత్తం హెయిర్ అంతా ఇలానే అల్లుకోవాలి.

15 ఇప్పుడు జడ మొత్తానికి కుడి ఎడమ వైపుల ఉన్న పాయలను బాగా లూజ్ చేసుకోవాలి.

16 తరువాత చివర్లు ఒక్కసారి దువ్వెనతో దువ్వుకుని ముందు కాస్త ఫంక్ తీసుకుంటే కత్తిలాంటి హెయిర్ స్టైల్ మీ సొంతమవుతుంది.



# ప్లీటెడ్ స్కర్ట్

స్కూల్ యూనిఫామ్స్ మాత్రమే కాకుండా కొన్ని రకాల ప్రొఫెషన్స్‌లోనూ గర్ల్స్ యూనిఫామ్స్‌కి ఈ ప్లీటెడ్ స్కర్ట్ తప్పనిసరి. వీటి కొనుగోలుకు ఇబ్బంది అక్కర్లేదు. యూనిఫామ్ కలర్ క్లాత్ తీసుకొని ఎవరికి వారు డిజైన్‌చేసుకోవచ్చు. దీని డిజైనింగ్‌లో ముందు డ్రాఫ్టింగ్‌లో మెలకువలు తెలుసుకుంటే కుట్టడం సులువు అవుతుంది.

**స్కర్ట్ కొలతలు:**

శరీర ఎత్తు, లావును బట్టి స్కర్ట్‌కి కొలతలు తీసుకోవాలి.

* నడుము చుట్టుకొలత
* హిప్ డిస్టెన్స్
* హిప్ రౌండ్
* స్కర్ట్ పొడవు (మోకాలి వరకు)

భావన
డిజైనర్

నిర్వహణ: ఎన్.ఆర్



కర్టెసీ: ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ డిజైన్ ఇన్నోవేషన్ (ఐడీఐ), హైదరాబాద్ www.idi.co.in

## స్కర్ట్ ఫ్లెయిర్ పార్ట్

- AB = స్కర్ట్ పొడవు – బెల్ట్ పొడవుతో కలుపుకొని
- AC = నడుము కొలత /2
- AA1 = A1 C1 = C1 C = 3 పార్ట్స్ నడుము దగ్గర సమాన కొలత తీసుకోవాలి.
- A1, C1 – B1, D1 మార్క్ చేయాలి.



## 2వ ఫిగర్

- B1, D1 నుంచి A1, C1 మార్క్ చేయాలి.

## బెల్ట్ పార్ట్

- AB = బెల్ట్ పొడవు
- AC = నడుము కొలత /2
- తీసుకొని దానిని ప్లీట్స్ పై భాగాంలో జత చేయాలి. దీంతో పాటు అంచు భాగం కుట్టేస్తే స్కర్ట్ సిద్ధమైపోతుంది. బెల్ట్‌కి సైడ్‌పార్ట్‌లో లేదా ముందు భాగంలో బటన్స్‌ని అమర్చుకోవచ్చు.

## ఫిగర్ 3

- అవసరాన్ని బట్టి ప్లీట్స్ డివిజన్స్ చేసుకోవాలి. (ఇక్కడ 3 డివిజన్స్ ఇచ్చాం)
- AA2 = నడుము నుంచి హిప్ వరకు
- 0 నుంచి 1 దగ్గర మడవడానికి స్ట్రెయిట్‌గా నిలువు లైన్, అలాగే 4 నుంచి 5 దగ్గర మడవడానికి మరో లైన్ డ్రా చేయాలి. వీటికి మధ్య 2-3 లైన్ మార్క్ చేయాలి. అదేవిధంగా 2, 3 బాక్స్‌పైన 4-5 నుంచి క్లాత్ తీసుకొని మడవాలి. అదే విధంగా 0-1 నుంచి 2-3 వరకు మరో ప్లీట్ మడవాలి. దీనిని A2 లెవల్స్ లేదా 1, 3, 5 లెవల్ అనవచ్చు. ఇదేవిధఃగా రెండో వైపు కూడా బాక్స్ ప్లీటెడ్ తయారుచేసుకోవాలి.
- ఇలాగే అన్ని వైపులా ప్లీట్స్ సెట్ చేసి కుడితే స్కర్ట్ రెడీ అవుతుంది.

**బెల్ట్ పార్ట్ డ్రాఫ్టింగ్:**




**స్కర్ట్ ఫ్లెయిర్ పార్ట్**




**2వ ఫిగర్ డ్రాఫ్టింగ్**




**3వ ఫిగర్ డ్రాఫ్టింగ్**



**మన్యవీరుడు అల్లూరి గాథ**

## 5

‘‘ఇదిగో రాజులబ్బాయ్! తమరికి సర్కారు వారు రాసిచ్చిన భూమి ఇదే. యాభయ్ ఎకరాలు. సీలేరు ఒడ్డు. నక్క తోకని తొక్కి వచ్చావ్! అదే తూర్పు. తాసీల్దారుగారి మేలు జన్మలో మరచిపోకూడదు. ఆ దిబ్బ మీదే ఇల్లు కడతాం. ఇల్లంటే ఓ పాక. అది పడమర. అక్కడ ఆ తాటితోపే సరిహద్దు. నేను ముందే చెబుతున్నాను. నాకు పితూరీలూ, సభలూ అంటే సరిపడవు. ఇందులో ఎంత దున్నుతావో ఆలోచించుకో. అప్పటిదాకా అన్నీ మేమే పంపుతాం. అన్నట్టు నీకు తల్లిగారు, తోడబుట్టినోడు ఉన్నారంట కదా! ఆళ్లని ఎప్పుడు తీసుకొస్తావు? తాదూర సందులేదు గానీ, మెడకో డోలంట! సరే, జన్మ అన్నాక అమ్మా అయ్యా, అన్నదమ్ములూ, అప్పచెల్లెళ్లూ ఉండకపోరు. కానీ భారం మన మీదున్నప్పుడు మొయ్యాలి కదా! అందుకంటన్నాను.’’

పుల్ల విరిచి పొయ్యిలో పెట్టిన రీతిలో అంతా చెప్పేశాడు దుచ్చర్తి ముఠాదారు చెక్కా లింగందొర.

లింగందొర రంప రాజ్యంలో గొప్ప ప్రభుభక్తి పరాయణుడు.

ముందురోజు మధ్యాహ్నమే నర్సీపట్నం పోలీసులు తీసుకువచ్చి ఫజులుల్లాఖాన్ ఆదేశం మేరకు దుచ్చెర్తిలో లింగందొరకి అప్పగించారు శ్రీరామరాజుని.

‘‘గిల్లితే పాలుగారేలా ఉన్నాడు, ఈ కుర్రోడి గురించేనా మీరు ఇంత హైరానా పడతన్నారు?’’ అని పోలీసులని లింగందొర వెక్కిరించాడు కూడా.

ఎప్పుడొస్తాడో తెలియదు, వచ్చి ఒకసారి చూసి పోతుంటాడతడు గుర్రం మీద వచ్చి.

పదిరోజుల తరువాత యాభయ్ ఎకరాలకి శాశ్వత పట్టా తెచ్చి చేతిలో పెట్టాడు లింగందొర.

పదిహేను రోజుల తరువాత పాక కూడా సిద్ధం చేయించాడు.

పైడిపుట్ట నుంచి అడ్డతీగెలకు మూడుమైళ్లు. నిత్యం వెళ్లి పోలీసు స్టేషన్‌లో సంతకం చేసి రావాలి. ఆ దారిలో వెళుతున్నప్పుడూ అంతే, అప్పుడప్పుడు ఒక కానిస్టేబుల్ తనని వెంటాడడం గమనించాడు రామరాజు.

తల్లినీ, తమ్ముడినీ పైడిపుట్ట పంపవలసిందని కృష్ణదేవిపేట ఉత్తరం రాశాడు రామరాజు.

• • •

ఆ రోజు సాయంత్రం రామరాజును వెతుక్కుంటూ నది దగ్గరకు వచ్చింది సూర్యనారాయణమ్మ.

వేసవి. నదిలో తెల్లటి ఇసుక తిన్నె మీద వెల్లకిలా పడుకుని ఉన్నాడు రామరాజు.

తమ్ముడు సత్యనారాయణరాజు నత్తగుల్లలు ఏరుతున్నాడు దూరంగా.

‘‘రా అమ్మా!’’ అన్నాడు రామరాజు. ఆమె వచ్చి కొడుకుకు దగ్గరగా కూర్చుంది.

పది నిమిషాలు మౌనంగా ఉండి తరువాత అందామె.

‘‘చిట్టిబాబూ! ఈ కొండ్ర నీకు ఎందుకిచ్చారో నాకైతే అర్థం కావడంలేదు. ఈ భూమితో నిన్ను రైతుని చెయ్యాలనుకుంటున్నారో, ఖైదీని చేయాలని అనుకుంటున్నారో తెలియడం లేదు. ఇంకొకటి చెప్పనా! తమ్ముడు ఇలాగే ఉంటే రేపన్ననాడు ఏం చేస్తాడు? వాడూ నాలుగు అక్షరాలు నేర్చుకోవాలి. మనం ఏ నరసాపురమో, భీమవరమో– నీకు నచ్చే చోటికి– వెళ్లిపోదాం, ఆలోచించు నాన్నా!’’

‘‘నిజమేనమ్మా! పైడిపుట్ట నాకు గోడల్లేని కారాగారమే.’’ అన్నాడు రామరాజు.

‘‘అయితే, ఆలోచించావన్నమాట. తుని, మోగల్లు ఎక్కడికైనా సరే. వెళ్లిపోదాం మరి!’’ అన్నదామె, ఆర్తిగా.

‘‘అక్కడికి నేనెలా రాగలనమ్మా! ఇది చూడు! నిన్న ప్రవహించిన నదికి జాడ కదా! ప్రవాహం లేకపోయినా కంటికి కనిపిస్తూనే ఉంది నది. నిన్నటి ప్రవాహం అలికిడి చెవులలో మిగిలే ఉంటుంది. నా జీవితమూ అంతే. దద్దాకీ, చుట్టాలకీ ఇప్పుడు నామీద ఎలాంటి అభిప్రాయం ఉంటుందో నేను ఊహించగలను. తమ్ముడి చదువు ముఖ్యం. నువ్వు వెళ్లు. నేను నేపాలు యాత్రకి వెళ్లాలని అనుకుంటున్నాను.’’ అన్నాడు రామరాజు.

నిలువెల్లా వణికిపోయింది ఆ మాట విని, ఆమె.

‘‘మళ్లీ యాత్రలేమిటి నాయనా? సంపాదించిన పుణ్యం చాలకా? ఇంక నన్ను బాధ పెట్టకురా!’’ ఉబికి వస్తున్న కన్నీళ్లు ఆపుకుంటూ అన్నది సూర్యనారాయణమ్మ.

‘‘నిన్ను బాధ పెట్టాలని నేను ఏనాడూ అనుకోనమ్మా! పరిస్థితులు అలా వస్తున్నాయి. అందుకు నన్ను క్షమించమ్మా! ఈ నిఘా, ఈ పరోక్ష కారాగారం మనకొద్దు. మీరు ముందు వెళతారు. నేను నేపాలు యాత్ర తరువాత వస్తాను.’’ అన్నాడు రామరాజు.

‘‘చిట్టిబాబూ! నన్ను వదిలిపోకు



● డా. గోపరాజు నారాయణరావు

నాన్నా!'' అంది దాదాపు ఏడుస్తూ.

''వెళ్లనమ్మా! కానీ నేను అక్కడికి వస్తే నీకు కొత్త కష్టాలు తప్పవు. తమ్ముడి చదువూ సాగదు. నా పేరు చెబితే ఏ బడిలో చేర్చుకుంటారు చెప్పు! నేను వెళ్లేది నేపాలు యాత్రకే!'' అన్నాడామె చేతులు పట్టుకుని.

బావురుమందా తల్లి హృదయం.

అది విని తమ్ముడు వచ్చాడు గబగబా.

తల్లిని ఓదార్చడం రామరాజు వల్ల కాలేదు. తన కారణంగా ఒక అమాయకురాలికి, ఒక సాధారణ గృహిణికి వచ్చిన కష్టంతో అతడికి కన్నీళ్లొచ్చాయి. పరిస్థితుల మీద ఆగ్రహం కలిగింది.

చీకట్లు కమ్ముకుంటున్నాయి. పది నిమిషాలకి ఏదో నిశ్చయానికి వచ్చినట్టు లేచి నిలిచిందామె.

## 6

'మీకు కల్పించగలనన్న వాతావరణం నేను కల్పించలేకపోయాను. అందుకు క్షంతవ్యుణ్ణి. పోలీసు నిఘా నేనూహించింది కాదు. సరే, నీ కోరిక మేరకే, నిన్ను ఇంటర్న్‌మెంట్ నుంచి విడుదల చేస్తున్నాను. నీవు నేపాల్ యాత్రకు వెళ్లు. గండకీ నది నుంచి సాలగ్రామాలు తెచ్చుకోవాలన్న నీ ఆకాంక్షకి నేను అడ్డు చెప్పలేను. చెప్పే హక్కు నాకు లేదు.' అని చెప్పి అనుమతిపత్రం రాసిచ్చాడు ఫజులుల్లా.

ఆ పత్రం ఇస్తూ కళ్లలోకి చూశాడు ఫజులుల్లా ఖాన్. ఆ కళ్లు నిజం చెప్పడంలేదనిపించింది.

## 7

పైడిపుట్ట వచ్చి మూడు మాసాలు పూర్తవుతున్నాయి అంతే. ఇక్కడ నుంచి వెళ్లిపోవాలన్న తన ఆకాంక్ష తల్లి నోటి నుంచి కూడా వినిపించాక తనను ఎవరో నడిపిస్తున్నారన్న భావన కలిగింది రామరాజుకి.

ఆ రోజు హఠాత్తుగా విన్న వార్తతో అది మరింత బలపడింది.

అడ్డతీగెలకు ఐదు మైళ్ల దూరంలోనే ఉంది తిమ్మాపురం. అక్కడున్న ప్రభుత్వ అతిథి గృహంలో ఫజులుల్లా ఖాన్ జూలై 27న హఠాత్తుగా చనిపోయాడు.

ఒక పక్క అలాంటి మనిషి కన్నుమూయడం బాధాకరంగానే ఉంది. మరో పక్క ఇక తను స్వేచ్ఛాజీవి. ఆ విషయం మాత్రం తెలియని ఆనందాన్ని నింపుతోంది.



ముందు ఎద్దుల బండి వెళుతోంది. వెనకే రామరాజు గుర్రం మీద అనుసరిస్తున్నాడు.

అది చెక్కా లింగం దొర గుర్రాలలో ఒకటి.

పృష్ఠం మీద సెగగడ్డ విపరీతంగా బాధ పెడుతోంది మూడురోజుల నుంచి. కొద్దిగా జ్వరం కూడా ఉంది. కానీ ఆ బాధ తల్లి గమనించకుండా జాగ్రత్త పడుతున్నాడు.

సత్యనారాయణరాజు మాత్రం బండిలో నిద్రపోతున్నాడు.

వేటమామిడి వచ్చింది. గుర్రం దిగి తల్లి దగ్గరకి వచ్చి కాళ్లు రెండూ స్పృశిస్తూ దణ్ణం పెట్టాడు రామరాజు.

కంట తడి పెట్టలేదు సూర్యనారాయణమ్మ.

''ఈ తల్లి బతికే ఉందని గుర్తుంచుకో తండ్రీ! క్షేమసమాచారాలు తెలియచేస్తూ ఉండు చాలు!'' అన్నదామె.

కొడుకును కంటి నిండా చూసుకుని మళ్లీ బండెక్కిందామె. అది రాజమండ్రి దిశగా కదిలిపోయింది.

రామరాజు గుర్రం వెనుదిరిగింది.

రెండు నిమిషాలకే పృష్ఠం మీద కురుపు చితికింది. ఇంతకాలం బాధించిన ఆ సలుపు చేత్తో తీసి పక్కన పెట్టినట్టయింది.

## 8

''కిన్నెరల వాగు దగ్గర!''

ఆ వచ్చినవాడు చెప్పాడు ఎండు పడాలుకి.

''మొదట గుర్రం నడుముకు అంటుకున్న రక్తాన్ని కడిగాడు. అతడికి ఎడమవైపున నడుం నుంచి కాలి దాకా పంచంతా రక్తమే. అది కూడా కడుగుతున్నాడు. ఏదో గాయం కాబోలు!'' ఇంకొంచెం వర్ణించాడతడు.

''నడ చూద్దాం!'' గొంగళి కప్పుకుని ఆ వచ్చినవాడి వెంటే వెళ్లాడు పడాలు. అతడు పడాలు మనిషే.

అప్పుడే తెల్లవారుతోంది. వర్షాకాలం కారణంగా నిండుగా పారుతున్న కిన్నెరలవాగు నీళ్లు సంజకెంజాయలో ఎర్రగా ఉన్నాయి.

ఆగంతకుడు స్నానం కూడా పూర్తి చేసినట్టున్నాడు. సూర్యుడికి అర్ఘ్యం వదులుతున్నాడు.

గుర్తు పట్టలేకపోయాడు ఆ మనిషిని. అడుగులో అడుగు వేసుకుంటూ వాగు గట్టు దాకా వచ్చి నిలబడ్డాడు పడాలు. నెమ్మదిగా అన్నాడు, ''ఎవరు?''

అతడు తిరిగి చూశాడు. వెంటనే మూడుసార్లు దోసిలితో నీళ్లు వదిలి గట్టు మీదకు వచ్చాడు.

సరాసరి పడాలు ఎదురుగానే నిలబడి అడిగాడు, ''బాగున్నారా పడాలు గారూ!''

ఒక్క లిప్త ఆలస్యమైనా చటుక్కున గుర్తు పట్టాడు పడాలు, ఆ గొంతు.

''స్వామీ! మీరా!? మీరు... మీరు ఇక్కడ....?'' అన్నాడు పడాలు, రెండు చేతులు జోడించి, విస్మయంగా.

''ఎక్కడికి రావాలో అక్కడికే వచ్చాను. ఎందుకు రావాలో అందుకే వచ్చాను.'' అన్నాడు రామరాజు, నడుమకు కట్టుకున్న అంగవస్త్రం తీసి పిడుస్తూ.

''ఏదైనా దెబ్బ తగిలిందా స్వామీ! కులాసాగానే ఉన్నారు కదా! రక్తం కడుక్కున్నారట....'' అన్నాడు ఆందోళనగా పడాలు.

తన పొడవాటి జులపాలను పిడిచిన గుడ్డతోనే తుడుచుకుంటూ అన్నాడు రామరాజు. ''అదే పడాలు గారూ! వేధించి వేధించి, అర్ధరాత్రి చితికింది.. వ్రణం. ఎంత హాయిగా ఉందనుకున్నారిప్పుడు. ఆ జ్వరం, ఆ సలుపు అన్నీ పోయాయిప్పుడు.''



వారం రోజుల తరువాత లింగందొరని ఒక యువకుడు కలిసి, తనను శ్రీరామరాజు పంపించాడని చెప్పి, గుర్రాన్నీ, ఒక లేఖనీ అప్పగించాడు.

లేఖ తెరిచి చూశాడు లింగందొర.

పైడిపుట్ట

14-6-1922

మహారాజశ్రీ దుచ్చర్తి ముఠాదారు శ్రీ చెక్కా లింగం దొరగారికి

అల్లూరి శ్రీరామరాజు వ్రాయు లేఖార్థములు

నేను నేపాళము వెళ్ల నిశ్చయించితిని. కావున, ఈ సంవత్సరం నాకు పైడిపుట్టలో 50 ఎకరములకు ఇప్పించిన శాశ్వతపు పట్టా మాయమ్మయ్యగారు వెళ్లేటప్పుడు పుస్తకములలో పెట్టుకుని వెళ్లిపోయినారు. నాకా భూమితో ఏ జోక్యము లేదు. మీ ఇష్టం వచ్చినవారికి ఈయవచ్చు. ముందు ఎప్పుడూ నేనా భూమి విషయమై ఏ తగాయిదాయున్నూ చేయను. మీరు నాకిప్పించిన పట్టా నా వద్ద ప్రస్తుతము లేనందున ఈ యుత్తరము వ్రాయడమైనది.

చిత్తగించవలెను

శ్రీ అల్లూరి శ్రీరామరాజు

'అసలేంటి ఈ కుర్రోడు?' అనుకుంటూ ఎంత ఆలోచించినా అంతుపట్టడం లేదు లింగందొరకి.



నలభై నిమిషాల తరువాత అప్పుడే హఠాత్తుగా మోగింది, కేడీపేటలో వైర్‌లెస్.

''హలో... కొయ్యూరు క్యాంప్... కొయ్యూరు క్యాంప్... '' ఎవరో కానిస్టేబుల్ గొంతు.

''హలో... హలో... కేడీపేట క్యాంప్. ఏరా బాస్టర్డ్స్! రామరాజుని అరెస్టు చేసేశామని ఒళ్లు తెలియడం లేదా? ఎక్కడ చచ్చారు? ఓవర్!'' అరిచాడు ఫర్బీస్.

''అందర్నీ బయటే కాపలా ఉండమని చెప్పారు మేజర్ దొరవారు.'' అన్నాడు అవతల కానిస్టేబుల్.

‘‘వాడొకడు. ఎవరిమాటా వినడు.’ మనసులోనే అనుకున్నాడు ఫర్బీస్

‘‘సరే, నర్సీపట్నం నుంచి ఈవ్‌లింగ్ చెప్పిన సమాచారం కొయ్యూరు క్యాంప్ అధిపతికి చేరిందా? లేదా?’’ స్పష్టంగా, పట్టిపట్టి అడిగాడు ఫర్బీస్.

‘‘తెలియదు దొర!’’ అన్నాడు అవతల కానిస్టేబుల్.

‘‘గోటూ హెల్! గొంతు పగిలేటట్టు అరిచాడు ఫర్బీస్.



## ఆరవ అధ్యాయం

‘‘మన పోరాటం మొదలైంది!’’

శబరికొండ మీద ప్రకటించాడు రామరాజు.

‘‘తొలి అడుగు వేయడానికి ముందే గుర్తించవలసిన కొన్ని వాస్తవాల గురించి మననం చేసుకోవడానికి మనం ఇక్కడ కూర్చున్నాం.’’ మళ్లీ రామరాజే అన్నాడు.

ఈ మాటతో ఉప్పొంగిపోయారు అక్కడ ఉన్న అరవై డెబ్బయ్ మంది.

**‘‘మనం ఆరంభించే ఈ కొత్త ఉద్యమంలో పాల్గొనేవారు కొన్ని నియమాలు పాటించాలి. అవి చెబుతాను. బ్రహ్మచర్యం పాటించాలి. దుర్వ్యసనాలు వదలాలి. స్త్రీలను తల్లుల్లా చూడాలి. ఇది ప్రజల కోసం ఉద్యమం. ఉద్యమకారుల పోషణ బాధ్యత ప్రజలు స్వచ్ఛందంగా తీసుకోవాలి. ఇందులో బలవంతం మాత్రం లేదు.’’ ఒక్క క్షణం ఆగాడు రామరాజు.**

ఇప్పుడు వాళ్లంతా చూస్తున్న శ్రీరామరాజు, కృష్ణదేవిపేటలో చూసిన ఆ యోగి కాదు. యుద్ధభూమిలో ఆయుధం పట్టి నిలిచిన యోధునిలా కనిపిస్తున్నాడు.

19-8-1922... రాత్రి ఎనిమిది గంటల ప్రాంతం.

ఉదయం రాజరాజేశ్వరీదేవి అమ్మవారికి అందరితో కలసి పూజలు చేశాడు రామరాజు. వంద కలశాలతో నీళ్ల తెప్పించి అభిషేకం చేయించాడు. చివరిగా పూజ కోసం వచ్చిన పెద్దలనీ, ఉద్యమంలో భాగస్వాములు కాబోతున్నవారినీ ఒకచోట సమావేశపరిచాడు. ఆ కొండ గ్రామం రచ్చబండ దగ్గర కూర్చున్నారంతా.

అవసరమైతే ఉపయోగపడతాయని తెచ్చిన ఐదారు లాంతర్లు చప్టాలా ఉన్న పెద్ద రాయి మీద మసక వెలుతురునిస్తున్నాయి.

నక్షత్రాలు మసకబారిపోయాయి, ఆ శ్రావణమాసపు వెన్నెల ఆకాశంలో.

మనుషులు వినడం సాధ్యంకాని సంగీతమేదో అడవికి వినిపిస్తున్నట్టుంది వెన్నెల. కొద్దిగా అవతల కనిపిస్తున్న ఆ లోయ గుండె నిండా వెండి వెలుతురు బిందువుల కుంభవృష్టి. స్పర్శకు అందని, ఆకృతికి అతీతమైన మహాశిల్పంలా మలిచి అడవి అందాన్ని ఇంకా ఇంకా పెంచుతోంది వెన్నెల.

గాం సోదరులు, ఎండు పడాలు, గోకిరి ఎర్రేసు, మోదిగాడు, కణ్ణిగాడు, పనసల కణ్ణయ్య పడాలు, గోలిసింగి సన్యాసి, కాకూరు లచ్చమయ్య, కొర్రాబు లింగయ్య, సెగ్గి ఎర్రయ్య, బోనంగి పండుపడాలు, రీమల సన్యాసి, సుంకరి పోతయ్య, సరిబాల పరదేశి, కాకూరు గంగడు, కాకూరి బాలయ్య, కొటికల బాలయ్య ... ఎందరో రామరాజు ఇంకా ఏం చెబుతాడోనని ఎదురు చూస్తున్నారు.

నిశ్చలమైన స్వరంతో చెబుతున్నాడు రామరాజు.

‘‘ఇంకా మిన్నకుంటే మహా ద్రోహమే అవుతుంది. గండకీ నదిలో సాలగ్రామాల కోసం నేపాళం వెళతానన్న మీరు ఇక్కడికి వచ్చి ఈ ఉద్యమం ఎందుకు ఆరంభిస్తున్నారు? అని అడిగారు కూడా లక్ష్మయ్య గారు, ఉదయం పూజ వేళ. ఈ పరిస్థితులలో భారతీయుడన్నవాడు తిరుగుబాటు చేయకుండా ఉంటాడా?! ఎలాంటి పరిస్థితుల్లో బతుకుతున్నాం?! తిరగబడకపోయినా నీ నేలలో నీవు తిరుగుబాటుదారుడవే అవుతున్నావు. నీ ఆకలికేక వాళ్ల దృష్టిలో అలజడి కోసం నినాదం. ఇంక తిరుగుబాటుకు వెనకడుగెందుకు? పోరాటం భుజాలకెత్తుకుని పుట్టిన తరం మనది.

‘‘ఆకలితో, భయంతో చచ్చిపోవడం ఎందుకు? ధైర్యంగా ఉద్యమమే చేద్దాం! మన ఉనికిని కాపాడుకుందాం! ఉద్యమం అంటే భవ్యమైన భవిష్యత్తును గర్భంలో మోస్తున్న సంక్షుభిత వర్తమానమే.

‘‘ఎంతో రక్తపాతం తరువాత మళ్లీ సాహసించి ఇంకో పోరుకు సిద్ధమవుతున్న మన్యం చాలా విషయాలు గమనించాలి. నిన్నటి లాగరాయి అలజడి సమయంలో ఏం జరిగిందో, చివరికి ఏమైందో కూడా తెలుసు. అది గుర్తుకు తెచ్చుకుంటూ, రేపు మనం ఎలా అడుగేయాలో నేర్చుకుందాం. అంతా కలసి అడుగులో అడుగు వేయాలి. అంతా కలసి గొంతు విప్పాలి. అందుకే మీ గొంతులు గంధకపు గనులు కావాలి. మీ గుండెల్లో, గొంతుల్లో తరతరాల నుంచి గూడుకట్టుకుని ఉన్న మౌనాన్ని కొండలలో వదిలి, కొండగాలితో మీ ఊపిరి తిత్తులను నింపుకోండి. మనందరి ఉమ్మడి శ్వాసే ఉద్యమ రూపం దాల్చాలి.

‘‘మనం ఆరంభించే ఈ కొత్త ఉద్యమంలో పాల్గొనేవారు కొన్ని నియమాలు పాటించాలి. అవి చెబుతాను. బ్రహ్మచర్యం పాటించాలి. దుర్వ్యసనాలు వదలాలి. స్త్రీలను తల్లుల్లా చూడాలి. ఇది ప్రజల కోసం ఉద్యమం. ఉద్యమకారుల పోషణ బాధ్యత ప్రజలు స్వచ్ఛందంగా తీసుకోవాలి. ఇందులో బలవంతం మాత్రం లేదు.’’

ఒక్క క్షణం ఆగాడు రామరాజు.

‘‘సామీ! బేస్టీను అనే రాక్షసుడి కతేమిటి?’’ అడిగాడు కొటికల బాలయ్య, ఇక ఉండలేనట్టు.

ఆ గొంతు నుంచే వినిపించినా, మౌనంగా ఉన్న చాలా మంది పెదవుల మీద ఉన్నదీ అదే ప్రశ్న.

‘‘మీ ఆక్రోశం అర్థమైంది. బాస్టియన్ అధికార మదం గురించి నాకూ తెలుసు. కానీ ఒక ఉద్యోగి చేసిన దుర్మార్గాల మీద ప్రతీకారం తీర్చుకోవడం కోసం మనం ఉద్యమం మొదలుపెట్టడం లేదు. ఏ ఉద్యోగినైనా చంపడం ఏమంత కష్టం? కానీ దానివల్ల ప్రయోజనం ఎంత? ఈ బ్రిటిష్ సామ్రాజ్యంలో నా పినతండ్రి ఓ ఉద్యోగి. వారి దృష్టిలో నేను రాజద్రోహిని. మేమిద్దరం ఎంత ద్వేషించుకున్నా, మాలో ప్రవహించే ఒకే రక్తం మాటేమిటి? అలాగే భారతీయులంతా. కానీ నేను ఒక చెంప కొడితే మరో చెంప చూపమని మాత్రం చెప్పడం లేదు. ఆయుధం పట్టమంటున్నాను. కానీ మన చేతి ఆయుధం ప్రభుత్వం పంచన చేరిన భారతీయులని శత్రువులుగా చూస్తూ, వారి మీద గురిపెట్టడానికి కాదు. మనం ఏ కోశానా భారతీయుడన్నవాడిని ద్వేషించం. మన శత్రువు తెల్లవాడు.’’ వివరించాడు రామరాజు.

ఎవరూ మాట్లాడలేదు. రెండు రోజుల తరువాత కలుసుకోవాలని నిర్ణయించి అంతా వెళ్లిపోయారు.

ఆ ఊరి మునసబు ఇంటి దగ్గర దిగబెట్టిన గంతన్నతో అన్నాడు రామరాజు.

‘‘బాస్టియన్ రోడ్డు పనిలో ఎంత అమానుషంగా ప్రవర్తించాడో నాకూ తెలుసు. ఇప్పుడు ఆ రోడ్డు ఉద్యమానికి బాటలు పరిచింది. ఇలాంటి సమయంలో ఆ బాస్టియన్ అనే వాడిని చంపేస్తే మనవాళ్ల ఆవేశం ఇక నిలబడదని నేను చెప్పగలను. ఆవేశం చల్లారితే ఇక ఉద్యమం ఎక్కడిది?’’ అన్నాడు రామరాజు.

‘‘సత్యమే చెప్పారు. సెలవు.’’ అని వెళ్లిపోయాడు గంతన్న.

ఒంటరిగా కూర్చున్నాడు రామరాజు. నిద్ర రావడం లేదు. తనే కాదు, అక్కడకొచ్చిన వారంతా కూడా నిద్రకు దూరమయ్యారు.

ఆ రోడ్డు వారి కళ్లల్లో కదలాడుతోంది-పచ్చటి మన్యం మీద ఎప్పటికీ చెరగని నెత్తుటి వాక్యంలా.

రోదనను నింపుకున్న ఆ చిక్కటి ఎర్రధూళి గానం చేస్తోంది – కొండవాళ్ల గుండెల్లో మానని గాయం గాథ....

*(తరువాయి భాగం వచ్చేవారం)*

• పాటతత్వం

# అందెల రవమిది...



సిరివెన్నెల సీతారామశాస్త్రి
గీత రచయిత

'స్వర్ణకమలం' సినిమాలో 'అందెల రవమిది పదములదా అంబరమంటిన హృదయముదా' పాటతత్వం గురించి గీతరచయిత సిరివెన్నెల సీతారామశాస్త్రి తన భావాలను ఇలా పంచుకున్నారు....

భగవంతుడు ప్రతి ప్రాణికీ ఏదో ఒక కళ ప్రసాదిస్తాడు. అది గ్రహించి ఆనందం పొందగలిగితే అదే పరమానందం. అప్పుడు ఆ కళ ద్వారా జనం కూడా ఆనందిస్తారు. అయాచితంగా వచ్చిన విద్యను చులకనగా భావించకూడదని పెద్దలు చెబుతారు. ఇందులో కథానాయిక తనకు తన తండ్రి నుంచి వారసత్వంగా వచ్చిన నాట్యాన్ని తక్కువగా చూస్తుంది. ఏదో ఒక హోటల్‌లో టిప్‌టాప్‌గా డ్రెస్ చేసుకుని, అందరికీ సర్వ్ చేస్తూ ఉండాలనుకుంటుంది. నాట్యంలో ఎత్తుకు ఎదగాలనుకోదు. అటువంటి మనస్సు కలిగిన ఆ అమ్మాయి ఒకసారి, తన తండ్రి ఫొటోకి దండ వేసి నాట్యం చేస్తున్న శిష్యుడిని చూస్తుంది.




మనసు నాట్యం వైపుకు మళ్లుతుంది. ''నీ నాట్యంలో ఆత్మ లేదు, ఎవరి కోసమో పని చేస్తుంటే ఆనందం, తృప్తి ప్రయోజనం ఏవీ ఉండవు. నీ కోసం నువ్వు చేయాలి...'' అనే మాటలు మనసులో మెదలుతాయి.

'నాట్యం దైవీయమైన విభూతి. నాట్యం చేయడమంటే శరీరాన్ని ఊపడం, కళ్లు కదపడం, పెదవుల ధ్వనులు... కాదు. మనసు లగ్నం చేసి నర్తించాలి. అప్పుడు నీ హృదయస్పందన నీకు తెలుస్తుంది' అని సాటి నృత్యకారిణి అన్న మాటలు ఆమె మనస్సును తట్టి లేపుతాయి. ఆమె వెంటనే ఎవ్వరూ లేని మైదాన ప్రదేశంలో తనను తాను మరచిపోయి పరవశంతో నర్తిస్తుంది. ప్రకృతితో మమేకమై నాట్యం చేస్తుంది.

అమ్మ చేసే నాట్యాన్ని లాస్యం, శివుడు చేసే నాట్యం తాండవం అంటారు. విశ్వమంతా ఆయన తాండవంలా ఉంటుంది. నాట్యం చేయడానికి కొంత సరంజామా కావాలి. ఎందరికో లభించని విద్య ఆమెకు వరంగా భగవంతుడు ప్రసాదించాడు. ఏ పనినీ తక్కువగా చూడకూడదు. ముఖే ముఖే సరస్వతి. స్వాత్మానందం కోసం నాట్యం చేయాలనేది ఈ పాటలో వివరించాను.

ఈ పాటలో కథక్, ఒడిస్సీ, మణిపురి, కూచిపూడి... అన్ని నాట్యరీతులూ కనిపిస్తాయి.

**- సంభాషణ: డా. పురాణపండ వైజయంతి**

• ఉత్తమవిలన్

# ఈ టిట్లాకు తిక్క రేగితే!

తన శత్రువును తాను ఎలా ద్వేషిస్తాడో మిగిలిన వాళ్లు కూడా అలాగే ద్వేషించాలి. తన శత్రువుపై తాను ఎలా కసితో రగిలి పోతాడో మిగిలిన వాళ్లు కూడా అలాగే రగిలి పోవాలి. లేకుంటే తేడాలు వస్తాయి.

ఇళ్లు కాలిపోతాయి.

'నెత్తి మీద టోపీ. చేతిలో పవరు... మూతి మీద మీసం ఉందని... దేవుడు...దేవుడు అని భజన చేశారు. ఏకే సీ గోలీసే...' అంటూ మాటలతో మంటలు రేపగలడు టిట్లా.

'టిట్లా' అంటే మాటలా?

మాటల్లోనే తూటాలు పేలుతుంటాయి!

'విక్రమార్కుడు' సినిమాలో 'టిట్లా'గా.... వేషంతో సహా క్రూర హావభావాలతో భయపెట్టించాడు అజయ్.

'ఖుషి' సినిమాలో ఈవ్ టీజర్‌గా ప్రేక్షకుల దృష్టిలో పడ్డ అజయ్ 'ఒక్కడు' 'ఛత్రపతి' సినిమాలలో ఆవేశం మూర్తీభవించిన పాత్రలలో నటించి తనదైన గుర్తింపు తెచ్చుకున్నాడు. 'విక్రమార్కుడు' సినిమాలో 'టిట్లా' అనే గట్టి విలన్‌గా ప్రేక్షకుల దృష్టిలో మిగిలిపోయాడు.

విజయవాడలో పుట్టి పెరిగిన అజయ్ ఎమ్‌సెట్ కోచింగ్ కోసం హైదరాబాద్ వచ్చాడు. జూబ్లీహిల్స్‌లో ఉన్న ఆ కాలేజీ పరిసరాల్లో తరచుగా సినిమా షూటింగ్‌లు జరుగుతుండేవి. షూటింగ్‌లను ఆసక్తిగా చూసేవాడుగానీ 'నటించాలి' అని పెద్దగా అనుకోలేదు. ఆ తరువాత మాత్రం నటించాలనే కోరిక బలపడడంతో ఒక ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరాడు.

'కౌరవుడు' సినిమా డైరెక్టర్, అజయ్ నాన్నకు తెలిసిన వ్యక్తి కావడంతో ఆ సినిమాలో నటించే ఛాన్సు దొరికింది. 'పెద్దగా స్ట్రగుల్ కాకుండానే సినిమాల్లో నటించే ఛాన్సు వచ్చింది. ఇక 'నల్లేరు మీద నడకే' అనుకున్నాడు. అయితే తొమ్మిది నెలలు గడిచినా ఏ సినిమాలోనూ నటించే ఛాన్సు రాలేదు. 'ఖుషి' సినిమా సెలెక్షన్‌కు వెళ్లి, సెలెక్ట్ అయిన తరువాత మాత్రం ఇక వెనక్కి తిరిగి చూసుకోవాల్సిన అవసరం రాలేదు. రాజమౌళి 'సింహాద్రి' సినిమాలో చిన్న విలన్ రోల్ పోషించాడు. షూటింగ్‌లో పాల్గొనడానికి కేరళకు వెళ్లినప్పుడు 'మీ సినిమాలో గుర్తుండిపోయే పాత్రలో నటించాలని ఉంది' డైరెక్టర్‌తో రిక్వెస్ట్‌గా అన్నాడు. ఆయన నుంచి ఎలాంటి స్పందన లేదు. ఆతరువాత మాత్రం 'సై' సినిమాలో విలన్ తమ్ముడిగా అజయ్‌కి పవర్‌ఫుల్ రోల్ ఇచ్చాడు రాజమౌళి. ఇక 'విక్రమార్కుడు' సినిమాలో చేసిన 'టిట్లా' పాత్రతో పెద్ద గుర్తింపు తెచ్చుకున్న అజయ్ 'ఉత్తమ విలన్'గా తన ప్రత్యేకతను చాటుకుంటున్నాడు.


అజయ్

# ● సాల్వ్ చేస్తారా? శీర్షాసనమేస్తారా?

## ● మాయా బజార్

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | |
| | | | | 4 | |
| 5 | | | | | |
| | | | 6 | | |
| 7 | 8 | | | | |
| | 9 | | | | |
| 10 | | | | 11 | |

**అడ్డం:**

1. సూపర్‌హిట్ పాట 'తెలవారదేమో స్వామి' ఉన్న సినిమా. కె.విశ్వనాథ్ దర్శకత్వం వహించిన ఈ సినిమాలో రాజశేఖర్, సుమలత జంటగా నటించారు (5)
4. రామ్‌గోపాల్ వర్మ దర్శకత్వంలో రేవతి, చిన్నా, రోహిణి హట్టంగడి, ఆకాశ్ ఖురానా, విజయ్ చందర్... నటించిన హారర్ సినిమా (2)
5. సురేష్ కృష్ణ దర్శకత్వంలో నాగార్జున అక్కినేని నిర్మించిన ఈ సినిమాలో జగపతిబాబు, సంఘవి జంటగా నటించారు. సినిమా పేరు అటు నుంచి (2)
6. పవన్ కళ్యాణ్ తొలి సినిమా 'అక్కడ అమ్మాయి ఇక్కడ అబ్బాయి' కథానాయిక (3)
7. అనిల్ కన్నెగంటి దర్శకత్వంలో సందీప్ కిషన్, అనిషా అంబ్రోస్ జంటగా నటించిన సినిమా. సాయికార్తీక్ సంగీతం సమకూర్చారు. అటు నుంచి (2)
9. శోభన్ దర్శకత్వంలో యం.ఎస్.రాజు నిర్మించిన ఈ సినిమాలో ప్రభాస్, త్రిష జంటగా నటించారు. దేవిశ్రీప్రసాద్ సంగీతం (2)
10. ముత్యాల సుబ్బయ్య దర్శకత్వంలో రాజశేఖర్, గౌతమి, రోజా నటించిన ఈ సినిమా హిందీలో సునీల్‌శెట్టి హీరోగా 'భాయ్' పేరుతో రీమేక్ అయింది (2)
11. 'తెలుగు వీర లేవరా దీక్ష భూని సాగరా' 'దేవుడు చేసిన మనుషుల్లారా' 'మనిషే మణిదీపం' పాటలు రాసిన మహాకవి (2)

**నిలువు:**

1. లోకనాయకుడి ముద్దుల తనయ. 'రేసుగుర్రం 'గబ్బర్‌సింగ్' 'కాటమరాయుడు' 'శ్రీమంతుడు' సినిమాల కథానాయిక (5)
2. 'స్వయంవరం' సినిమాతో కథానాయికగా పరిచయం అయ్యారు. 'మనోహరం' సినిమాతో ఉత్తమ నటిగా నంది అవార్డ్ గెలుచుకున్నారు (2)
3. ముత్యాల సుబ్బయ్య దర్శకత్వంలో వినోద్ కుమార్, ఆమని, ప్రియా రామన్ నటించిన సినిమా. ఆకెళ్ల సంభాషణలు రాశారు. పేరు కింది నుంచి (7)
8. ఐ.గోపాల్ దర్శకత్వంలో కృష్ణ, రాజశేఖర్, సౌందర్య, సంఘవి...నటించిన సినిమా. ఎస్.ఏ.రాజ్‌కుమార్ సంగీతం సమకూర్చారు (3)

## ● మైథోగ్రఫీ

1. విగతజీవులను బతికించే ఔషధం.



2. కుంభకర్ణుని కొడుకు... పై జవాబులో '4'వ అక్షరంతో.



3. చంద్రుడు, ఒక రుషి... 2వ జవాబులో మొదటి అక్షరంతో.



4. బ్రహ్మ... పై జవాబులో '3'వ అక్షరంతో.



5. మహిషాసురుని తల్లి... 4వ జవాబులో '2'వ అక్షరంతో.



## ● బ్రెయిన్ జిమ్

1. ఒంటి కన్ను ఉన్నా... చూడలేనిది.
2. పాలు కాని పాలు.
3. 'ఎందుకు?' అని అడిగే అక్షరం...
4. పన్నెండు నెలల్లో decemberలో మాత్రమే ఉండేది.

| | | | | |
|---|---|---|---|---|
| సూ | జ | న | వ | శ్రీ |
| ది | చే | S | Y | G |
| ల | K | గ | B | వ |
| V | D | ర | మ | వి |
| పి | R | పా | పా | లు |

### జవాబులు

**● మాయా బజార్**

**అడ్డం:** 1. శృతిలయలు 4. రాత్రి 5. ఆహా 6. సుప్రియ 7. రన్ 9. వర్షం 10. అన్న 11. శ్రీశ్రీ

**నిలువు:** 1. శృతిహాసన్ 2. లయ 3. శ్రీవారి ప్రియురాలు 8. రవన్న

**● మైథోగ్రఫీ**

1. సంజీవని 2. నికుంభుడు 3. నిశాకరుడు 4. కమలభవుడు 5. మహిష్మతి

**● బ్రెయిన్ జిమ్**

| | | | | |
|---|---|---|---|---|
| సూ | జ | న | వ | శ్రీ |
| ది | చే | S | Y | G |
| ల | K | గ | B | వ |
| V | D | ర | మ | వి |
| పి | R | పా | పా | లు |

## ● కిసుక్కు



అప్పారావు: నా పేరు అబ్బులు. నా భార్య పేరేమో సుబ్బులు. మా అబ్బాయికి ఏ పేరు పెడితే బాగుంటుంది?

సుబ్బారావు: 'అరబ్బులు' అని పెట్టు.

– పి.యోబు, ముదనూరు

## ● మీకు తెలుసా



'ఫాల్స్ మెమొరీస్' అంటే?



కొన్ని సంఘటనలు జరగక పోయినా... ఎప్పుడో ఎక్కడో జరిగినట్లు అనిపించడం. ఒక విధంగా చెప్పాలంటే 'ఫాల్స్ మెమొరీస్' మనల్ని మోసం చేస్తాయన్నమాట!

## పదశోధన - 433

నిర్వహణ : **అదృష్టదీపక్**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | | 4 | | 5 | ■ | 6 | 7 |
| 8 | | | ■ | | ■ | 9 | | | |
| 10 | | ■ | 11 | | | | ■ | ■ | |
| 12 | | 13 | ■ | | ■ | ■ | 14 | | |
| | ■ | 15 | 16 | ■ | 17 | | | ■ | ■ |
| ■ | 18 | | | | | ■ | ■ | 19 | 20 |
| 21 | ■ | | ■ | ■ | 22 | | 23 | ■ | |
| | ■ | | 24 | | | ■ | 25 | | |
| 26 | | ■ | 27 | | ■ | 28 | ■ | ■ | |
| | ■ | 29 | | | ■ | 30 | | | |

**ఆధారాలు**

**అడ్డం**

1. పానీయంలో అడ్డం వచ్చే పుల్లముక్క – సామెత (7)
6. విరిగిన బియ్యపు గింజ (2)
8. బియ్యం కడిగిన నీరు (3)
9. లాక్షాగృహం – పాండవులను చంపడానికి సుయోధనుడు తగులబెట్టించిన ఇల్లు (4)
10. వెనక్కి తిరిగిన రాజు (2)
11. చిలుకలు ఇష్టపడే ఫలం (4)
12. కొనుగోలులో శిలతో వచ్చిన తగ్గింపు (3)
14. కాగిన పాలమీద తెట్టె (3)
15. చిన్న పొద (2)
17. పాము విడిచిపెట్టే చర్మంపై పొర (3)
18. మృత్యువార్త – ఇది చల్లగా చెప్పాడని లోకోక్తి (5)
19. జీలకర్ర (2)
22. కుశలమా? (3)
24. నూలుపోగు, జంధ్యం (2)
25. దండోరా (3)
26. రూపం మారిన దొంతర (2)
27. కబళం, ముద్ద (2)
29. మధ్యభారతంలో ఒక నది (3)
30. దారి వెంట నడచిపోయేవాడు (4)

**నిలువు**

1. రావూరి భరద్వాజ ప్రసిద్ధ నవల (5)
2. అర్ధరాత్రి (4)
3. చర్మంపై తేలిన గడ్డ, బుడిపె (2)
4. పుట్టుకతోనే దేహం మీద ఏర్పడిన నల్లని చుక్క (4)
5. స్వప్నంతో ఉన్నాడు (3)
6. నుయ్యి మొదటి రూపం (2)
7. సురాభాండం (4)
13. ఈ పక్షి కూతను అపశకునంగా భావిస్తారు (5)
14. మగవారి మూతి మీద మొలిచేది (2)
16. పైకి ఎగిరిన మండూకం (2)
17. కౌరవ, పాండవుల రణరంగం (4)
20. రాజుగారి అమ్మాయి (5)
21. ఈశ్వరుడు కూడా పట్టలేని చోరుడు (4)
23. పలుకు (2)
24. గాడిదలా ధ్వనించే కానుక (3)
27. కర్త, క్రియల మధ్యలో వచ్చే పదం (2)
28. లేగదూడ అరుపు (2)

### పదశోధన - 432 జవాబు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 మో | 2 ము | ■ | 3 నా | 4 య | న | ■ | 5 మి | ■ | 6 అం |
| 7 వి | న | 8 త | ■ | వ | ■ | 9 క | న్ను | ■ | గ |
| ■ | 10 గ | తి | లే | ని | వా | డు | ■ | 11 గ | డి |
| 12 కం | చె | ■ | ■ | క | ■ | 13 పు | 14 కా | రు | ■ |
| 15 ప | ట్టు | 16 ద | ల | ■ | 17 క | మం | డ | లం | ■ |
| రం | ■ | ధి | ■ | 18 చె | మ | ట | ■ | ■ | 19 వి |
| ■ | 20 మం | ■ | 21 మా | రు | తం | ■ | 22 చి | ■ | తం |
| 23 ను | దు | రు | ■ | వు | ■ | 24 క | ల | కం | డ |
| ■ | బి | ■ | 25 జిం | ■ | 26 మొ | ■ | క్కో | ■ | వా |
| 27 తా | ళ్ల | పా | క | అ | న్న | మ | య్య | ■ | దం |

## • ఫుడ్ పిరమిడ్

పక్కన కనిపిస్తున్న ఫుడ్ పిరమిడ్‌లో కనిపిస్తున్న అక్షరాలలో కొన్ని ఆహార పదార్థాలు, వంటకాల పేర్లు దాగున్నాయి. కనుక్కోనేందుకు ప్రయత్నించండి. ఇది మీ పాకశాస్త్ర పరిజ్ఞానానికి ఒక తమాషా పరీక్ష. ఈ అక్షరాలతో ఎన్ని ఎక్కువ పదాలను కనుక్కోగలిగితే మీకు అంత ఎక్కువగా పాక పరిజ్ఞానం ఉన్నట్లు లెక్క. ఒక్కో పదానికి ఒక్కో మార్కు లెక్కన ఎన్ని వస్తాయో చూసుకోండి.

క
ల కం డ
జ్జి కా య లు మ
గ పు సు పీ త ర ప్పా
స ణు గు ల్ల ట్టు పె వ్వ రు వ

**మార్కులు**

ఫర్వాలేదు: 8
బాగుంది: 10
అద్భుతం: 12



## • పదవినోదం

గడులలో అస్తవ్యస్తంగా ఇచ్చిన అక్షరాలను సరైన వరుసలో పదాలుగా అమర్చండి. గడులలో వృత్తాల నడుమ ఇచ్చిన అక్షరాలతో వచ్చే అర్థవంతమైన పదబంధాన్ని కనుక్కోండి.

1. న (వృత్తంలో), నా, య, క, లు, శో (వృత్తంలో)
2. రు, డు, రా (వృత్తంలో), ప (వృత్తంలో), త్ప
3. ధ (వృత్తంలో), కు, త్య, స, లు, శో (వృత్తంలో)
4. ధ (వృత్తంలో), వ, సే, వ, మా
5. భీ, రి (వృత్తంలో), అ (వృత్తంలో), రు, క, డు
6. క్ర, రా, ప (వృత్తంలో), మం

**పదవినోదం జవాబులు**

అ ప రా ధ ప రి శో ధ న

1. శోకనయనాలు 2. పరాత్పరుడు 3. సత్యశోధకులు 4. మాధవసేవ 5.అరిభీకరుడు 6. పరాక్రమం

## సుడోకు - 193

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 7 | 4 | | | 9 | 5 | | |
| 1 | | | | 7 | | 8 | 3 | 4 |
| 3 | | 2 | | | 4 | | | 1 |
| | | 1 | 9 | 4 | | 6 | 7 | 5 |
| | 8 | 6 | 3 | 1 | | | | |
| | | 7 | 5 | | | | | 3 |
| | 2 | | | 6 | 3 | | | |
| | | | 2 | | 5 | | | |
| | 9 | | | | | 4 | | |

కఠిన స్థాయి 1 2 3 4 5

### సుడోకు - 192

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 8 | 6 | 9 | 4 | 7 | 3 | 5 |
| 5 | 7 | 3 | 1 | 8 | 2 | 9 | 6 | 4 |
| 6 | 4 | 9 | 7 | 5 | 3 | 1 | 2 | 8 |
| 2 | 8 | 1 | 5 | 6 | 7 | 3 | 4 | 9 |
| 3 | 9 | 4 | 8 | 2 | 1 | 6 | 5 | 7 |
| 7 | 5 | 6 | 4 | 3 | 9 | 8 | 1 | 2 |
| 4 | 6 | 5 | 3 | 7 | 8 | 2 | 9 | 1 |
| 8 | 3 | 2 | 9 | 1 | 5 | 4 | 7 | 6 |
| 9 | 1 | 7 | 2 | 4 | 6 | 5 | 8 | 3 |

## 30 ఏప్రిల్ నుంచి 6 మే 2017 వరకు

సింహంభట్ల సుబ్బారావు
జ్యోతిష్య పండితులు





### మేషం: (అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఆర్థిక పరిస్థితి కొంత ఇబ్బంది కలిగించవచ్చు. రుణదాతల నుంచి ఒత్తిడులు. చేపట్టిన కార్యక్రమాలు ముందుకు సాగవు. ఆలోచనలు నిలకడగా ఉండవు. కుటుంబసభ్యులతో వివాదాలు. భూములు, వాహనాలు కొనుగోలు యత్నాలు నిరాశ కలిగిస్తాయి. ఆరోగ్యంపై శ్రద్ధ చూపండి. వ్యాపారాలు స్వల్పంగా లాభిస్తాయి. రాజకీయవర్గాలకు పర్యటనలు వాయిదా. వారం మధ్యలో శుభవార్తలు. ధనలాభం. పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. గణేశాష్టకం పఠించండి.



### వృషభం: (కృత్తిక 2,3,4 పా, రోహిణి, మృగశిర 1,2 పా.)

కుటుంబంలో కొద్దిపాటి చికాకులు. పనులు మందకొడిగా సాగుతాయి. నిర్ణయాలలో తొందరపాటు వద్దు. ఆరోగ్యపరంగా చికాకులు. ఆర్థిక పరిస్థితిలో మార్పు ఉండదు. ఆస్తి ఒప్పందాలు వాయిదా పడతాయి. వ్యాపార లావాదేవీలు సామాన్యంగా ఉంటాయి. ఉద్యోగులకు మార్పులు ఉండవచ్చు. పారిశ్రామికవర్గాలకు శ్రమాధిక్యం. వారం చివరిలో శుభవార్తలు. ఆహ్వానాలు అందుతాయి. తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. దుర్గాస్తోత్రాలు పఠించండి.



### మిథునం: (మృగశిర 3,4, ఆరుద్ర, పునర్వసు 1,2,3 పా.)

ఆశ్చర్యకరమైన విషయాలు తెలుసుకుంటారు. విద్యార్థులు అనుకున్న ఫలితాలు సాధిస్తారు. దూరప్రాంతాల నుంచి శుభవార్తలు. రాబడి ఆశాజనకంగా ఉంటుంది. ఆరోగ్యం కొంత కుదుటపడుతుంది. ఉద్యోగయత్నాలు సానుకూలమవుతాయి. సేవా కార్యక్రమాలలో పాల్గొంటారు. వాహనయోగం. వ్యాపారాలు విస్తరిస్తారు. ఉద్యోగులకు ఉన్నతహోదాలు దక్కుతాయి. కళాకారులకు పురస్కారాలు అందుతాయి. వారం మధ్యలో వివాదాలు. ధనవ్యయం. ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. హనుమాన్ చాలీసా పఠనం మంచిది.



### కర్కాటకం: (పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)

కొన్ని వ్యవహారాలు ముందుకు సాగవు. ఆలోచనలు నిలకడగా ఉండవు. బంధువులతో వివాదాలు నెలకొంటాయి. ఆర్థిక, ఆరోగ్య సమస్యలు కొంత చికాకు పరుస్తాయి. కొన్ని బాధ్యతలు సవాలుగా మారతాయి. తీర్థయాత్రలు చేస్తారు. మిత్రులతో ముఖ్య విషయాలు చర్చిస్తారు. నిరుద్యోగులకు శ్రమాధిక్యం. వ్యాపారాలు సాదాసీదాగా ఉంటాయి. ఉద్యోగులకు పనిభారం. రాజకీయవర్గాలకు నిరుత్సాహమే. వారం మధ్యలో విందువినోదాలు. ధనలాభం. పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. ఆదిత్య హృదయం పఠించండి.



### సింహం: (మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఆలోచనలు అమలు చేస్తారు. విద్యార్థులు, నిరుద్యోగుల యత్నాలు అనుకూలిస్తాయి. ప్రతిభ వెలుగులోకి వస్తుంది. ఆర్థిక లావాదేవీలు ఆశాజనకంగా ఉంటాయి. సంఘంలో పేరుప్రతిష్ఠలు పెరుగుతాయి. చిన్ననాటి మిత్రులను కలుసుకుంటారు. కొంతకాలంగా వేధిస్తున్న ఆరోగ్య సమస్యలు తీరతాయి. వ్యాపారాలు విస్తరిస్తారు. ఉద్యోగులకు పదోన్నతులు తథ్యం. కళాకారులకు సన్మానాలు, విదేశీ పర్యటనలు. వారం మధ్యలో ధనవ్యయం. కుటుంబంలో చికాకులు. దక్షిణదిశ ప్రయాణాలు అనుకూలం. అన్నపూర్ణాష్టకం పఠించండి.



### కన్య: (ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త1,2 పా.)

అనుకున్న పనులు సాఫీగా సాగుతాయి. ప్రముఖులతో పరిచయాలు. పోటీపరీక్షల్లో విజయం సాధిస్తారు. మిత్రులతో వివాదాలు సర్దుబాటు కాగలవు. ఆలోచనలు కలిసివస్తాయి. వాహనాలు, భూములు కొనుగోలు చేస్తారు. ఆత్మీయుల నుంచి కీలక సమాచారం అందుతుంది. రాబడి సంతృప్తినిస్తుంది. వ్యాపారాలలో ఆశించిన లాభాలు తథ్యం. ఉద్యోగులకు విధుల్లో ప్రశంసలు. రాజకీయవర్గాలకు ఆకస్మిక విదేశీ పర్యటనలు. వారం ప్రారంభంలో వృథా ఖర్చులు. స్వల్ప అనారోగ్యం. ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. నవగ్రహస్తోత్రాలు పఠించండి.



### తుల: (చిత్త 3,4, స్వాతి, విశాఖ1,2,3 పా.)

ఆలోచనలు కార్యరూపం దాలుస్తాయి. ప్రముఖుల నుంచి కీలక సమాచారం. నిరుద్యోగులకు ఇంటర్వ్యూలలో విజయం. ఇంటి నిర్మాణ యత్నాలు ఫలిస్తాయి. గత జ్ఞాపకాలను గుర్తుకు తెచ్చుకుంటారు. వ్యాపారాలు లాభాలదిశగా సాగుతాయి. ఉద్యోగులకు హోదాలు పెరుగుతాయి. రాజకీయవర్గాలకు నూతనోత్సాహం. వారం ప్రారంభంలో బంధువులతో వివాదాలు. అనారోగ్యం. తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. అంగారకస్తోత్రం పఠించండి.

### వృశ్చికం: (విశాఖ 4 పా., అనూరాధ, జ్యేష్ఠ)

ఆర్థిక విషయాల్లో కొంత నిరాశ. సోదరులు, మిత్రుల నుంచి ఒత్తిడులు. ఆరోగ్య విషయంలో చికాకులు. ప్రముఖుల నుంచి ఒక ముఖ్య సందేశం అందుతుంది. నిరుద్యోగుల యత్నాలు ముందుకు సాగవు. వ్యాపార లావాదేవీలు సాదాసీదాగా ఉంటాయి. రాజకీయవర్గాలకు విదేశీ పర్యటనలు వాయిదా పడతాయి. వారం చివరిలో విందువినోదాలు. ఆహ్వానాలు అందుతాయి. వస్తులాభాలు. దక్షిణదిశ ప్రయాణాలు అనుకూలం. ఆదిత్య హృదయం పఠించండి.

### ధనుస్సు: (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

శ్రమానంతరం పనులు పూర్తి కాగలవు. ఆర్థిక పరిస్థితి అంతంతమాత్రంగా ఉంటుంది. సన్నిహితుల నుంచి విమర్శలు మనస్థాపం కలిగిస్తాయి. ఆరోగ్య, కుటుంబసమస్యలు చికాకు పరుస్తాయి. దూరపు బంధువులను కలుసుకుంటారు. విద్యార్థులకు ఒత్తిడులు. వ్యాపారాలలో లాభాలు స్వల్పంగానే ఉంటాయి. ఉద్యోగులకు బదిలీ సూచనలు. కళాకారులకు నిరాశ. వారం మధ్యలో శుభవార్తలు. ఆకస్మిక ధనలాభం. పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. విష్ణుసహస్రనామ పారాయణ చేయండి.

### మకరం: (ఉత్తరాషాఢ 2,3,4, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)

కొత్త విషయాలు తెలుసుకుంటారు. ప్రతిభాపాటవాలు వెలుగులోకి వస్తాయి. సభలు, సమావేశాలలో పాల్గొంటారు. ఆదాయం ఆశాజనకంగా ఉంటుంది. భూవివాదాలు పరిష్కారమవుతాయి. ఆధ్యాత్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. గత సంఘటనలు గుర్తుకు వస్తాయి. వాహనాలు, గృహం కొనుగోలు చేస్తారు. వ్యాపారాలు లాభసాటిగా ఉంటాయి. ఉద్యోగులకు పదోన్నతులు. రాజకీయవర్గాలకు ఒత్తిడులు తొలగుతాయి. వారం మధ్యలో ధనవ్యయం. స్వల్ప అనారోగ్యం. తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. నృసింహస్తోత్రాలు పఠించండి.

### కుంభం: (ధనిష్ఠ 3,4, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా.)

కొత్త పనులకు శ్రీకారం చుడతారు. ఆత్మీయులు, బంధువులతో సఖ్యత ఏర్పడుతుంది. కొన్ని వివాదాలు, సమస్యలు తీరి ఊరట చెందుతారు. విద్యార్థులకు అనుకూల ఫలితాలు దక్కుతాయి. అరుదైన ఆహ్వానాలు అందుతాయి. గత సంఘటనలు గుర్తుకు వస్తాయి. సేవాకార్యక్రమాలలో పాల్గొంటారు. వ్యాపారాలు విస్తరిస్తారు. ఉద్యోగులకు కొత్త హోదాలు రాగలవు. పారిశ్రామికవర్గాలకు సంతోషకరమైన సమాచారం. వారం ప్రారంభంలో వృథా ఖర్చులు. బంధువులతో తగాదాలు. దక్షిణదిశ ప్రయాణాలు అనుకూలం. గణేశాష్టకం పఠించండి.

### మీనం: (పూర్వాభాద్ర 4 పా., ఉత్తరాభాద్ర, రేవతి)

ఆదాయం కొంత నిరాశ కలిగిస్తుంది. చేపట్టిన పనుల్లో ఆటంకాలు ఎదురవుతాయి. బంధువులతో అకారణంగా విభేదాలు. ఆరోగ్య, కుటుంబసమస్యలు కొంత చికాకు పరుస్తాయి. నిరుద్యోగులకు కొంత నిరాశ. ధార్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. ఆస్తి విషయంలో ఒప్పందాలు వాయిదా వేస్తారు. వ్యాపారాలు అసంతృప్తి కలిగిస్తాయి. ఉద్యోగులకు పనిభారం. కళాకారులకు శ్రమ తప్ప ఫలితం కనిపించదు. వారం చివరిలో ధన, వస్తులాభాలు. సన్మానాలు. ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. దేవీస్తుతి మంచిది.

● టారో

30 ఏప్రిల్ నుంచి
6 మే
2017 వరకు












**టారో ఇన్సియా**
రేఖి అనలిస్ట్

### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 19)

వారమంతా విజయవంతంగా, నూతనోత్తేజంతో సాగిపోతుంది. మీ కష్టానికి తగిన గుర్తింపు, ఫలితమూ దక్కుతుంది. మీ విజ్ఞానాన్ని ఇతరులతో పంచుకునేందుకు ప్రయత్నించండి. ఆరోగ్యం బాగానే ఉంటుంది కానీ, వీపు నొప్పి, కొద్దిపాటి మానసిక ఒత్తిడి బాధించవచ్చు. సంగీత చికిత్స లేదా ప్రకృతి వైద్యం వల్ల ఆరోగ్యం మెరుగవుతుంది.

**కలిసొచ్చే రంగు: పసుపు**

### వృషభం (ఏప్రిల్ 20 - మే 20)

ఒక ఆశ్చర్యకరమైన సంఘటన జరుగుతుంది. మీ కలలు నిజం అయే అవకాశం కలుగుతుంది. పలుకుబడిగల వ్యక్తుల సహకారం లభిస్తుంది. గతంలో మీరు పెట్టిన పెట్టుబడుల నుంచి ఈ వారం ప్రయోజనం చేకూరుతుంది. మీ ఒత్తిళ్లు, బాధలు తొలగిపోతాయి. సాధించి తీరాలి అన్న పట్టుదలతో, ఆత్మవిశ్వాసంతో ఉండండి, తప్పకుండా సాధిస్తారు. కొత్త అవకాశాలు తలుపు తడతాయి.

**కలిసొచ్చే రంగు: వంకాయ రంగు**

### మిథునం (మే 21 - జూన్ 20)

ఎంతోకాలంగా మీరు ఎదురు చూస్తున్న కోరిక నెరవేరుతుంది. ఆత్మీయుల నుంచి మంచి కబురు అందుతుంది. చదువుకు సంబంధించిన వ్యవహారాలలో విజయం వరిస్తుంది. విందు వినోదాలలో తీరుబడి లేకుండా గడుపుతారు. మీ శక్తిసామర్థ్యాలకు పదును పెట్టుకుని, వేగంగా పని పూర్తి చేస్తారు. మీ ప్రేమ ఫలిస్తుంది. మీ మాటకు విలువ పెరుగుతుంది.

**కలిసి వచ్చే రంగు: బంగారం**

### కర్కాటకం (జూన్ 21 - జూలై 22)

పాతబంధాలు బలపడతాయి. కొత్త స్నేహితులు ఏర్పడతారు. నూత్న శక్తి సామర్థ్యాలతో ఉత్సాహంగా పని చేస్తారు. ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. ప్రేమలో ప్రధానమైన మార్పులు చోటు చేసుకుంటాయి. వృత్తి ఉద్యోగాల పరంగా విదేశీయానం చేయవలసి రావచ్చు. ఒక స్త్రీ మీ ఆరోగ్యాన్ని సంరక్షిస్తుంది. పెట్టిన పెట్టుబడుల నుంచి లాభపడతారు. మార్నింగ్ వాక్, యోగ వంటివి కొనసాగించడం మంచిది.

**కలిసివచ్చే రంగు: గోధుమ**

### సింహం (జూలై 23 - ఆగస్ట్ 22)

కొత్త ఆస్తులను కొనుగోలు చేస్తారు. మీ చేతిలో ఉన్న ప్రాజెక్టులను వేగంగా పూర్తి చేస్తారు. వ్యాపారులకు ఈ వారం చాలా అద్భుతంగా ఉంటుంది. మంచి ఆదాయాన్ని, లాభాలను కళ్లజూస్తారు. ప్రేమ కొత్త మలుపులు తీసుకోవచ్చు. గత జ్ఞాపకాలనుంచి, అనుభవాల నుంచి పాఠాలు నేర్చుకునేందుకు ప్రయత్నిస్తారు. కొత్త ప్రాజెక్టులకు ఆర్డర్లు అందుతాయి.

**కలిసివచ్చే రంగు: ఎరుపు**

### కన్య (ఆగస్ట్ 23 - సెప్టెంబర్ 22)

కోల్పోయిన వైభవాన్ని తిరిగి తెచ్చిచ్చే వారమిది. పనిప్రదేశంలో కొంచెం అసౌకర్యం కలగవచ్చు. అయితే అందరూ మీకు అనుకూలంగా ఉండటం వల్ల అన్ని అవరోధాలనూ అధిగమించగలుగుతారు. అదనపు బాధ్యతలను స్వీకరించవలసి వస్తుంది. పెట్టుబడుల విషయంలో కొంచెం ఆచితూచి వ్యవహరించడం మంచిది. కొత్త అవకాశం మీ తలుపు తట్టబోతోంది.

**కలిసొచ్చే రంగు: మావిచిగురు**

### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 22)

కొత్తబంధాలు, బంధుత్వాలు కలుస్తాయి. మీ తెలివితేటలను ఉపయోగించి, ప్రాక్టికల్‌గా ఉండటం అలవాటు చేసుకోవడం మంచిది. చేసే పనిని మరింత లోతుగా, శ్రద్ధగా చేయడం అవసరం. మీ సంభాషణా చాతుర్యంతో అందరినీ ఆకట్టుకుని పనులు పూర్తి చేసుకుంటారు. మీ కష్టసుఖాలను స్నేహితులకు చెప్పుకుని ఉపశమనం పొందుతారు.

**కలిసొచ్చే రంగు: ముదురాకుపచ్చ**

### వృశ్చికం (అక్టోబర్ 23 - నవంబర్ 21)

ఈ నెల మీకు అదృష్టాన్ని తెచ్చిపెడుతుంది. అధికార యోగం లేదా పదవీయోగం కలుగుతుంది. అందుకు సంబంధించిన వార్తలు వింటారు. ఇంతకాలం మీరు చేసిన పనులకు పేరు ప్రఖ్యాతులు వస్తాయి. దానికి ఓర్చుకోలేక మిమ్మల్ని చాటుగా విమర్శించేవారు ఎక్కువ అవుతారు. తెలివిగా తిప్పికొట్టడం అలవరచుకోండి. నూతన గృహ లేదా వాహన యోగం ఉంది. పలుకుబడిగల కొత్త మిత్రులు పరిచయం అవుతారు.

**కలిసొచ్చే రంగు: నీలం**

### ధనుస్సు (నవంబర్ 22 - డిసెంబర్ 21)

మీ మాటకు విలువ పెరుగుతుంది. అయితే అనివార్య కారణాల వల్ల పనులు ఆలస్యం అవవచ్చు. కీలకమైన ఒక ప్రాజెక్టును చేపట్టడం లేదా కొత్తవారితో పనిచేయవలసి రావడం జరగవచ్చు. సృజనాత్మకంగా చేసే పనులు విజయవంతమవుతాయి. మీ ముందు మంచిగా మాట్లాడుతూనే, వెనకాల గోతులు తవ్వేవారి విషయంలో అప్రమత్తత అవసరం.

**కలిసొచ్చే రంగు: బూడిదరంగు**

### మకరం (డిసెంబర్ 22 - జనవరి 19)

మీ ఆశలను నెరవేర్చుకోవడానికి, ఆశయాలను సాధించడానికి కొత్తప్రదేశాలకు వెళ్లవలసి వస్తుంది. దూరప్రయాణాలు చేస్తారు. లాభదాయకమైన వ్యాపారాన్ని చేపడతారు. అవకాశం వచ్చినప్పుడు దానిని అందుకోవడానికి వెనుకంజ వేయవద్దు. మీ బాధ్యతలను స్వీకరించడానికి సరైన వ్యక్తులను అన్వేషించవలసి వస్తుంది. భాగస్వామి సహకారం లభిస్తుంది.

**కలిసొచ్చే రంగు: వెండి**

### కుంభం (జనవరి 20 - ఫిబ్రవరి 18)

ఆఫీస్‌లో అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. అన్ని అననుకూలతలనూ అధిగమిస్తారు. ఎప్పుడో సాధించిన విజయానికి ఇప్పుడు విందుకు ఆహ్వానం అందడమో లేదా మీరు ఇవ్వడమో జరుగుతుంది. స్నేహితునికి అండగా నిలబడవలసి వస్తుంది. మీ త్యాగానికి తగిన ప్రతిఫలం లభిస్తుంది. మీ ప్రతిభకు, సామర్థ్యానికి గుర్తింపు రావాలంటే మాత్రం మీరు మరింత కష్టపడక తప్పదు.

**కలిసొచ్చే రంగు: ముదురాకుపచ్చ**

### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20)

విశ్రాంతిగా గడపడానికి, దూరప్రాంతాలకు విహారానికి లేదా పిక్‌నిక్‌కు వెళ్లడానికి ఇది తగిన సమయం. కొత్త స్నేహితులు ఏర్పడతారు. మీరు పర్యటనకు ముందే మీ పనులన్నీ పూర్తి చేసుకుని సిద్ధంగా ఉండటం మంచిది. అనవసరమైన ఆందోళనలు, ఆత్మన్యూనతలు పక్కనబెట్టి హాయిగా గడపండి. మీ ఆలోచనలకు, సృజనాత్మకతకు మెరుగులు దిద్ది, మీరేమిటో నిరూపించుకోండి. మన్ననలందుకోండి.

**కలిసొచ్చే రంగు: నారింజ**

